# DRAVA BHĀSHA

Poems of Dr. K.GEETA

**Price Rs.40 /-**

***Second Edition*** : ...

***Cover Painting :*** K. Sri Lalitha

***Composed by :*** Pushpa Rani, Cell : 9989916724

***Published by :***
SATYA PRACHURANALU

***Copies at :***
**Plot - 18, Little Heart Homes, Jeedimetla(V),**
**HYDERABAD - 500055. Cell : 9866220198.**
**Visalandhra Book House,** All Branches in A.P.
**Prajashakthi Book House,** Chikkadapally, Hyd. & All Branches in A.P., **Navodaya Book House,** Badi Chowdi, Hyderabad
**Disa Pustaka Kendram,** Chikkadapally, Hyderabad

***Printed at :*** **Prajasakthi Printing Press,** RTC 'X' Roads, Hyderabad.


## అంకితం

జీవితాన్నిచ్చిన అమ్మకు –
జీవించడానికి అర్థం చెప్పిన నా చిన్నారి కోమల్ కు –
పునర్జీవితాన్నిచ్చిన సత్యకు –

# ఇదీ వరసు ...

**ISMAIL**
78-11-16, RAGHAVA PLAZA, GANDHIPURAM - 3
RAJAHMUNDRY - 533 103. E.G. DIST. (A.P.)
TEL : 0883-475146 (RES)

DATE :

# మిస్డ్ లెటర్

చిన్నప్పటి రైలింకా ఛుక్ ఛుక్ మంటూనే వుంది
శబ్దం చెవిని పడ్డప్పుడల్లా పట్టాలు నాలొంచి అదురుపాటుగా పరుగులెడతాయి
నాన్నమ్మా! నాకు రాజకుమారుల కథలొద్దు గానీ
ముందిజ్జెప్పు –
గుండెందుకింకా రైలు బొగ్గు వాసనేస్తూంది?
ఎర్రజండా ఊపినా ఎగిసెగిసి పడ్తూంది
స్వీపరూడ్చిన సగం బతుకూ సరాసరి ఊపిరికడ్డం పడ్తూంది
కిటికీల్లోపల బలిసిన కంపార్టుమెంట్లు
కావరం ప్రదర్శిస్తున్నాయి
స్టేషన్ సగం అమ్ముడవుతూంటే, సగం కొనుగోలవుతుంది
ట్రాలీల చక్రాల మీద దడదడలాడుతూ
కొన్ని పొట్టలు సగం నిండుతాయి
కాశీ మజిలీలు కాస్సేపాపు గానీ –
కాలుష్యమైనా కడుపారా పీల్చాలనుంటుందేం?
నేలని కప్పుకునిక్కడే దీర్ఘనిద్ర చెయ్యాలనుంటుందేం?
ఒక్కమాట చెప్పు –
పదేళ్ళయి పోయినా లగేజీ కలీ లావెక్కడే?
స్టేషన్ల మధ్యెక్కడో నడాలిరిగిన ఇనప ముక్కలకి
అతుకులు వెతుక్కునేవాడిక అలసట రాదేం?

రోజూ రంగులునేర్పిన గార్డుకి వెలిసిపోయిన రోజులు మిగిలాయేం ?
కంకర్రాళ్ళని వరసగా పేర్చిన వాడి వేలు ముద్ర కనుమరుగయ్యిందేం?
ఇప్పుడు చత్వారమొచ్చి, చెవులు విన్పడకున్నా
నా మస్తిష్కానికింకా వయస్సు మళ్ళలేదు –
టికెట్ కలెక్టరింకా కిందకి దించెయ్యలేదు –
ఇంత గూడ్సూ ఇంకా పట్టాలు తప్పిపోలేదు –
నాన్నమా! నువ్వీ జన్మలోనూ చెప్పలేందోటడగనా!
బతుకెందుకు బ్రిడ్జిలాగ గజ గజ లాడుతూంది ?

*ఆదివారం ఆంధ్రజ్యోతి,*
*15-9-1992*



# నినాదం

ఆహ్వానిద్దాం రండి జీవితాన్ని వెయ్యి ఆకాకుత్తుకల్తో
మోగే ఆత్మ నినాదాల్లో – పట్టు'దల'ల తలల్తో
ఆకు చాటు కిరణాల్ని
వసంత ఋత్వు అరుణి మల్ని
కుహ కువల బుడి బుడి స్వరాల్ని గౌరవిద్దాం రండి
అందాల్ని పంచే అందవికార పునాదుల్ని
స్వాతి చినుకుల వెనుక దుర్గంధ నదీ నదాల్ని
కన్పడే జీవితం వెనుక కాలే బ్రతుకుల్ని
మనసారా ఒప్పుకుందాం రండి
మనం వ్యక్తిత్వం నించి సమస్యల్ని
అభిమానం నుంచి నగిషీల్ని
కారుణ్యం నించి అశాంతిని నేర్చుకున్న వాళ్ళం
మా గొంతులు అరుస్తున్నాయి లెమ్మన్న ధీమా నిండిన బధిరులం
మన కాళ్ళ క్రింద కుట్రల్ని,
దోషిత్వాన్నంటగట్టే సంస్కృతీ మూలల్ని
భుజం చుట్టూ కప్పుకున్న పవిత్ర స్త్రీలం
రెండు పాదాలూ ఓ దిశగా పయనించే చోట మొదలవుదాం రండి
మన్ని మనమే శంకించుకునే చోటి నించి
ముందుతరాలకో స్థిరభద్రతా జీవితాన్ని
సువిస్తరం చేద్దాం రండి

ఆదుకోవాలని అర్థించే రోజుల్ని తెగనరుకుద్దాం రండి
బండనేసి బాదైనా దృఢత్వం నేర్పిద్దాం మనసుకి
కొరడాల్తో విరగొట్టి దైన్యాల రక్తం చిందిద్దాం
మనకింకా అగ్ని ప్రవేశాలేనా ?
ఇంకా విధి వంచనలేనా ?
కాళ్లూ చేతులు మరే ప్రాణైనా, అణగదొక్కితే చితకతొక్కి వుండేది
వేలెత్తి కరవాలం ఘుళిపించి వుండేది
మన్ని మనం విస్తరించుకుందాం రండి
అవసరార్థ ఆప్యాయతల్ని మనమూ అలవాటు చేసుకునో
అవకాశాల్ని అన్ని సందర్భాల్లోనూ వినియోగించుకునీ
ఆహ్వానిద్దాం రండి
దిక్కులుపిక్కటిల్లే నినాదాల్తో – పట్టుదలల తలల్లో
కొత్త జీవితాన్ని – ఆహ్వానిద్దాం రండి

"ఆహ్వానం "
జూన్, *1997*



# వెన్నెల చేతి కర్ర

ఆనందంగా జీవించడం కన్నా గొప్ప లక్ష్యం వుందా!?!
జీవించడమే అద్భుత అవకాశం అయిన చోట
నిశ్చింతగా బ్రతకడం కన్నా అధికమైన వరం వుందా!?!
అనుబంధపు అత్తరు సువాసనల మధ్య
అనురాగపు పూలదండల, పారాణీల మధ్య
ప్రేమైక హృదయాల సంగమమే వయసొచ్చిన వివాహాన్కి వేద మంత్రాలైనపుడు
కళ్ళల్లో చిందే స్వాప్నిక జల్లుల కిరణాల కన్నా
ముడిపడిన వేళ్ళ మధ్య పరుగెత్తే రక్తనాలాల కన్నా
అనిర్వచనీయ ఆనందం వుందా!?!
ఇవన్నీ జరిగితే బావుణ్ణని ఎన్నాళ్ళు కలలు కన్నానో –
ఏ చిన్న అవకాశం ఒకసారి వస్తే బావుణ్ణని ఎన్ని ప్రార్థనలు చేశానో –
కుందేలు పిల్లలా ముడుచుకుని వెగటు ప్రపంచం చాటున ఎంతగా
వెక్కిళ్ళు పెట్టానో –
ఇంద్రధనుస్సులా రంగులన్నిటినీ నాకే ఇవ్వమని ఎవరు చెప్పారో మరి –
ఉప్పునీళ్ళ వేళ్ళ నించి కొబ్బరి నీళ్ళు తీయనైనట్లు
బాదల ఊటల నించే సౌఖ్యాల్ని పొందమని ఎవరు నిర్దేశించారో మరి –
నోళ్ళు ఎంతగా ఉరుములై పిడుగులై నా నెలవంకలా
నీ చల్లని హృదయ హస్తంతో నా తలనిమిరావుచూడూ –
దిగులు కళ్ళలో దినకిరణాల వెలుతుర్ని పూయించావుచూడూ –

పరమానందంగా రోజు గడవడం కన్నా గొప్ప పరమావధి వుందా!?!
ఆశించడమే తడవుగా ఆనందం హాజరైన చోట –
దుఃఖిత జ్వలిత మానసాన్ని నువ్వే తీరం చేర్చగలవని ఎలా తెల్సునేస్తం నీకు!?!
చెలిమి కళ్ళతో వెన్ను నిమిరి
రెక్కల చాటున వెచ్చగా దాచుకుని
నన్ను నెమలి కన్నుని చేశావు నువ్వు
విశ్వమంతా చుక్కలే అలుముకుని దారితెలీక బేలగా నిల్చున్నపుడు
వెన్నుల చేతి కర్రతో నన్ను జాబిల్లి ఒడిలో లాలించావు చూడూ –
"మ మజీ వనహుతునా" అని మురిపెంగా నీ వెంట సప్తపదించావు చూడూ–
నా కష్టాల కెరటాలకి ప్రవాహాన్నిచ్చి కాలుష్యరహితం చేశావు చూడూ –
నిజంగా సంతోషపు వర్తమానం కన్నా
రేపు గొప్ప గతం ఇంకోటుందా?!
ఇంతకన్నా జీవితంలో రాని అద్భుత కాలం వుందా?!!

*(అముద్రితం)*





# ఇస్త్రీవాడు

అతడలా నలిగిన బతుకు మడతల్ని
ఆకలి నిప్పు పెట్టెతో సాఫీ చేస్తూనే వుంటాడు
రేపు ముందర లేస్తుందో, అతడు లేస్తోడో గానీ
నిర్విరామంగా రెండు చేతులా కాలపు రాతినతడి మోగిస్తూనే ఉంటాడు
వంగిన వీపు మీద మూటలు  సందుసందునా గంగిరెద్దు మూపురం
పెరిగినట్టు పెరుగుతాయి
పర్వతాల్ని మోసి మోసి భూమి గుండ్రంగా తయారైందన్నట్లు
వంగిన భుజాలు గూనైపోతాయి.
పేరులో పెన్నిధి లేని అతడు ఏ ఊరు వెళ్ళినా చాకలే
బట్టలకి కొదువలేని అతనికెప్పుడూ మిగిలేవి మాసిన గుడ్డలే
అతని సెలవు దినాలన్నీ ఆదాయం కత్తిరింపు దినాలే
ఊరందరి దుర్గంధాల్నీ పిండే
సజీవ ఉతుకు యంత్రం అతడు
సబ్బులరగదీసిన మొండి చేతులతో
బట్టల సోడా తీనివేసిన బంక చర్మంతో
నీలిమందుతో తెల్లబడి పాలిపోయిన జీవితంతో
అతడు రోజు రోజుకీ మోకాటిలోతు నీటిలో కూరుకుపోతుంటాడు
ఎప్పుడూ ఆరేసిన ఆశల దుప్పట్లని చీకట్లోకి దులిపి
రాలిపోయిన ఇసుక బతుకుని భుజానేసుకొస్తుంటాడు
కొంకర్లు తిరిగి పోయిన గొంగళీ అయినా సరే

అతడి చేతుల్లో మడతల కంబళీ అయి తీరుతుంది
పనికిరాని నల్ల పీలికైనా
తెల్లని పావురమై వరుసల్లో ఒదిగి కూర్చుంటుంది.
ఉదయ సాయంత్రాల్ని ఒక్కలాగే ప్రారంభించే అతడు
బొగ్గుల పొగనే ఊపిరిగా శ్వాసిస్తాడు
రాత్రి వేణ్ణీళ్ళతో నలత తీరిన శరీరాన్ని
నూటికి ఒకట్రెండు రూపాయల చొప్పున పద్దురాయించుకుంటాడతను
విరామం లేని వెర్రి చాకిరీని
వెలిగే రూపాయల తుండు గుడ్డ ఎప్పటికప్పుడు తుడుస్తూంటుంది
చుర్రున కాలే ఇస్త్రీ పెట్టె క్రింద
చల్లని నీళ్ళని చిలకరించుకుంటూ
ఉష్ణోగ్రతల హెచ్చుతగ్గుల మధ్య
స్వేదాన్ని ఉదకంలా తాగుకుంటూ
బరువుగా చేతులెత్తి పెట్టి
అతడలా నలిగిన బతుకు మడతలింర
ఆకలి నిప్పు పెట్టెతో సాఫీ చేస్తూనే ఉంటాడు

*(రంజని-కుందుర్తి అవార్డు అత్యుత్తమ కవిత 1996)*

*"ఈ వారం కవిత" ఆంధ్రజ్యోతి వీక్లీ*
*06-12-1996*



# వాడి కౌగిలి

వాడి కౌగిట్లో ప్రాపంచిక బాధల్ని మైమరింపించే పసి పింజా మరలుంటాయి
షట్దుర్బుద్దులన్నీ అణిగిపోయి నిశ్చింత మాత్రమే అనుభూతి పర్చుకుంటుంది
ఎన్నోసార్లు నా పగిలిన దుఃఖాలన్నీ ఆ చిన్ని మెడ వంపునే ప్రవహించాయి
లేత ఎముకలు గుచ్చుకునే ఆ సన్నని ఎద మంచం పైన నా చెంపల
వ్యధలన్నీ తేరుకున్నది
ఏమీలేని ప్రపంచంలో హఠాత్తుగా ఒక రోదనలేని ప్రత్యక్ష ప్రదేశం లభ్యమైనట్లు
ఇంకెక్కడా లేని నిర్భయపు స్థలం ఆ చిట్టి చేతుల్లోనే నిక్షిప్తమైవుంది
మనసంటూ వుండి నా ఇంత స్వచ్ఛంగా ప్రేమిస్తారా నన్నెవరైనా
నా నించి జన్మించి తిరిగి నన్ను పాపాయిని చేస్తారా
ఎవరైనా – వీడుతప్ప
నా జీవన పరితాపాల్ని తొలగించి
నా స్వాప్నిక కాలాన్ని పరిశుభ్రం చేసి
నా దుఃఖిత భయవిహ్వల సమయాన్ని చేత్తోతీసి పారేసి
నా కళ్ళని ఆనందాల్తో మెరిపిస్తారా వీడు తప్ప
వాడి కౌగిట్లో విసుగులేని మాతృత్వం విస్తృతమై వుంటుంది
నన్నెవరైనా ఇలా హత్తుకున్నారా ఎప్పుడైనా?!
వ్యధావేదనలు చెదిరిపోయేలా తలనిమిరారా ఎవరైనా?!
అమ్మా, నాన్నలు ఒక్కళ్ళే అయి నా కళ్ళు తుడిచారా?!
అయిదేళ్ళ బాల్యాన్ని వాడు అమ్మకు ఆపాదించి

విరిగిపోయిన తల్లి ఆవేదనల్నించి ఎదిగిన ప్రేమమూర్తిలా
వాడు లేత చుంబనాల్తో బాధల్ని ప్రక్షాళిస్తాడు
వాడు మనసంతా తీసి నా మెళ్ళో వేళ్ళాడదీసినట్లు
నా చేతుల్లోకెక్కి నన్ను కావలించుకుని
నా తలని తన కానించుకుని
తిరిగి తిరిగి నన్ను కష్టాల్నించి పునర్జీవింపచేస్తాడు
అవును మరి వాడి కౌగిట్లో
వెయ్యి జీవితాలకు సరిపడా నిశ్చింత శాంతి సోపానాలున్నాయి

*"ఈ వారం కవిత" ఆంధ్రజ్యోతి వీక్లీ*
*26-02-1999*





# వారాంతం

వారాంతం వలస పోయిన పక్షి గూడు చేరినట్లు ప్రశాంతంగా వాలుతుంది
వారమంతా నీకూ, నాకూ మధ్య వేనవేల యోజనాల దైరం
వారాంతానికి హఠాత్తుగా కుచించుకుని పోయి కౌగిట్లో ఒదిగిపోతుంది
వొంటింట్లో రుచికర వంటల్లో
టీవీ సినిమాల, పుస్తక పఠనాల ఉదయ మధ్యాహ్న సాయంత్రాలు
కెరటం వచ్చినంత వేగంగా వెనక్కెళ్ళి పోతాయి
గుండెల చప్పుళ్ళ మధ్య రెండు రాత్రుళ్ళ వారాంతం
ముద్దుల చెక్కిళ్ళ నానుకుని హాయించి సోలసిపోతుంది
వారమంతా ఉద్యోగపు రక్కసి త్రిప్పట నుండి
మనసు అమాంతం వల తెగిన చేపిల్లలా ఇంట్లోకి దుముకుతుంది
చెప్పులు, బేగ్గులు, వాటర్ బాటిళ్ళు, టిఫిన్ బాక్సులు
మడత నలగని బట్టల మెయింట్‌నెన్సులు వుండవు
నిద్రలేచిందగ్గర్నించీ మర్నాటి కోసం గాభరా ప్రిపరేషన్సూ వుండవు
ఆలస్యపు భోజనాలూ, సెలవిచ్చిన స్నానాలూ
చిరుతిళ్ళూ, చిలిపి అల్లర్లూ
కలల వారాంతాన్ని వాస్తవీకరించి ఇంటిని బృందావనం చేస్తాయి
ఇద్దరికీ ఆఫీసు ఒక్క రోజే సెలవంటే
పండగే మరి -
ఆదివారం ఆనందాన్ని ఆది -

ముఖాల్లో ఆఫీసు చిటపటలు
నచ్చని వాతావరణపు బలవంతపు నవ్వు పెదాలు
ఆలోచనకి తావులేని యంత్రాల నిమిషాలు అస్సలుండనే వుండవు
వారం మొత్తపు సమీక్షల్లో, ఆర్థిక భారాల్లో
ఒక్కోక్షణం మనసు కొనల విరుపు మాటలున్నా
బాధల్ని క్షణాల్లో తీర్చే ప్రేమౌషధం చిరుకోపాల్ని బుజ్జగిస్తుంది
పగలల్లా ఒకరి వెంట ఒకరు తిరిగే క్షణాలు
రాత్రంతా ఒకర్నొకరు అంటిపెట్టుకున్న మనసులు
తిరిగి వారం ప్రారంభించడాన్ని బెంబేలు బెంగపడతాయి
ఎటూ తోచక సోమవారం ఆలస్యపు నిద్రలేచి
గభాలున పనిఒత్తిడి వారాన్ని తొడుక్కుంటాయి
వారాంతపు విశాల ప్రేమైక క్షణాలు
ద్వారం దగ్గర విడిపోలేక చేతి చివర విల్లవిల్లాడతాయి

*(అముద్రితం)*





# స్పాట్ డెడ్

పేజీలకు పేజీలు ఎర్ర రంగు కత్తెరల్లో బతుకుతూ, చస్తూ వుంటాయి
"స్పాట్" డెడ్ కాగితాలన్నీ మళ్ళీ పరీక్ష దుఃఖాన్ని మోస్తూ
కట్టల్లోన్కి కూరుకుపోతాయి
విద్యార్థి చదువు వాయిదా వేసినంత సులభంగా
షికార్లని వాయిదా వేస్తే బావుండేది కదా?!
ఎగ్జామినర్లకి టైంపాస్ జోకులుగా జవాబులు మారకుండా వుండేవి
పదోతరగతి మేధావితనం ఎటు పోతుందో
పదో వంతు మార్కుల్తో పదహారేళ్ళు బుగ్గిపాలవుతాయి
చదువులు షోకిల్లాతనాన్ని ఆనవాళ్ళయిపోయిన చోట
కాలేజీకి రాగానే పెద్దాళ్ళయి పోయామనుకున్న అపరిపక్వ మనసుల మధ్య
పరీక్షల్లో దుర్నీతి
కాగితాల్లో పైత్యం
అత్తెసరు మార్కులో, అసలుకే నామమో కాక మరేం సాధిస్తాయి?!
ఏడాది పొడుగునా ఎకసక్కేలు, ఎగవేతల్తో
చదువు చత్తె బుట్టలో చేరుతుంది
పరీక్ష మూడు గంటలూ దిక్కులు తడుముకుంటూ
తిండి కోసం తడబడి ఈదుకొచ్చే ఆక్వేరియం చేపల్లా
గారడీ చూపుల్తో పక్క కాగితాల్లోకి ఎగబడడంతో సరిపోతుంది
ఏదో ఒక అద్భుతం జరిగి
ముప్పయిదాకా వచ్చినవన్నీ

దయతల్చి మందువేసవిలో నాల్గువానచినుకులు నాలుక తడిపినట్లు
మప్ఫైయ్యేదు సానుభూతి మార్జినుకి చేరి ఊపిరి పీల్చుకుంటాయి
తలెత్తకుండా రాసినట్లు
వచ్చే ఫస్టు క్లాసునాపడం బ్రహ్మతరం కాదనిపించే ముత్యాల అక్షరాల నించి
రాసిందే భాషో తెలీని పేపర్ల వరకు
పేజీలకు పేజీలు ఎర్రరంగు, పచ్చరంగు, నీలి రంగు ముద్రల్తో
చేతులు మారి మారి డస్సిపోయి
కత్తెర్లల్లోంచి అడకత్తెరల్లోన్కి
పొయ్యిలోంచి పెనం లోన్కి
మార్కుల్ని సదా రక్షించే స్క్రూటినైజర్ల సరసకు పంపిణీ అవుతాయి
హతవిధీ! ఎవరు రక్షించగలరు పోయే పరీక్షని!?
ఎంతకీ తప్పకుండా ఎవరా గలరు?!
రాసిన పేపర్ల కన్నా, రాయని కాలం విలువైనదని విద్యార్థికి అర్థమయ్యే
వరకు –

అడిగిన ప్రశ్నకి, అడగని జవాబులు వ్రాస్తూ
రేపు భవిష్యత్ ప్రశ్నకి –
ఎప్పటికీ సమాధానం వెతుక్కోలేని విద్యార్థిని ఎవరు గట్టెక్కించగలరు?
విద్యావిధానాలే కాదు
విద్యార్థి విధానాలూ మారాలని ఎవరూ గ్రహించనంత వరకు –

*(అముద్రితం)*



# నేను ఋతువునైన వేళ –

శరీర మంతా ఒకచోటే గడ్డకట్టినప్పుడు
ఒక వైయుక్తిక పర్వతం నిశ్శబ్దంగా విస్ఫోటనం చెందినపుడు
నేను బాధని అరచేతిలో పట్టుకొనడాన్కి
విఫలయత్నాలు చేస్తుంటాను
ఉన్నట్టుండి ఒక్క కుదుపు కుదుపుతుంది
నాలో నేనే –
ఘనం ద్రవమయ్యా –
మళ్ళీ గట్టిపడీ –
నెలకోసారి చచ్చినట్టు నన్ను నేను నెప్పిగా మార్చుకోవల్సొచ్చీ –
చచ్చీ –
పైకి తేలని గాయాన్ని పట్టీ మందెయ్యలేక
పక్కటెముకల్ని పిండి చెయ్యలేక
మూడంకె వవేసి మనసారా ముణగ దీసుకోవాలనున్నా
ముప్పయ్యారు గంటల అస్థిమితాన్నదుముకుని
అత్యవసర అస్పృశ్యంగా మిగల్లేక –
నాగరికతలో నాల్గడుగులు ముందుకు నడిచి
నీరసమయ్యా – నీరసమయ్యా
యుగాల్ని క్షణాల్లోకి తర్జుమా చేసుకుని
ఉరుకులు పరుగులై

సగం పనుల్నీ సంపూర్తి చేయ్యలేక –
వెన్నెముకని సమ్మెట మీద సాగదియ్యాలనిపించీ
మళ్ళీ మళ్ళీ ముప్పై రోజులకోసారి
పునర్జన్మలెత్తుతూ –
పేగుల్ని మెలిపెట్టి పిండే వృద్ధైన వేళ
ఈ వేళ –

*"ఈ వారం కవిత" ఆంధ్రజ్యోతి వీక్లీ*
*20-09-1991*





# ప్రాణం ఆనవాలు

ముసలితనం నిన్ను నిర్దయగా కౌగిలించుకుని ఎంత పని చేసింది!
అయ్యో- మెరుపు కళ్ళని గుంట గాజుకళ్ళుగా –
నల్లని ప్రవాహం లాంటి జుట్టుని తాటిటెంక మీద తెల్లని పేలికల్లా –
కాళ్ళని చచ్చిన పాముల్లా –
ఎంతకని రోదిస్తావులే పెద్దమ్మా ––
పెద్దమ్మా! ముంజేతి గాయం మీద ముసిరిన ఈగల్లాంటి ఈ జనాల్ని
ఎంతకని శపిస్తావులే ––
మాటైనా సరిగ్గా రాని పసికందు ప్రాణమైపోయింది కదా –
శాసించిన నీ గొంతు పళ్ళూడి మడతల్లో విరిగిపోయింది
నువ్వెన్ని పాపాలు చేసుంటే మాత్రం నిన్ను రోడ్డున పారేసిన
తొంభయ్యవయేడు శిక్షనెలా భరిస్తున్నావు?!
బాధల్తో దొర్లి దొర్లినా చావు రాదేం పాపం నీకు –
డొక్కల్ని అంటిపెట్టుకున్న చీరముక్కలే నువ్వు స్త్రీవనేందుకు సాక్షి
దుమ్ముకొట్టుకు పోయినా ప్రాణం ఈడుస్తున్నదే
నువ్వు మనిషివనేందుకు ఆనవాలు
శ్రమలేని బాల్యాన్ని, సుఖాల యౌవనాన్ని దాటి
ఈ ప్రస్థానానికెందుకొచ్చేవు –
ముసలితనం నిన్ను కసిదీరా చితకబొడిచి ఎంత ఘోరం చేసింది
అయ్యో – ఏడ్వడాన్ని గుక్కెడు నీళ్ళయినా లేవే
నీ వేళ్ళాడే తోలు గుండెల్లో

బతకడాన్ని గుప్పెడు మాంసమైనాలేదే నీబొమికల గూడులో
ఎందుకు మూలుగుతావులే పెద్దమ్మా!

పెద్దమా! ఎంతకని శపిస్తావులే నిన్ను "కుక్క" గా నైనా చూడని ప్రపంచాన్ని
అయ్యో – ఎవరిళ్ళలో వాళ్ళు
ఎవరి స్వార్థాలతో వాళ్ళు కులుకుతున్న బందిపోట్ల లోకాన్ని
నిన్ను చూసుకుంటూ వెళ్ళే నవ్వుకోగలుగుతున్న దుర్మార్గ ప్రజల్ని
తొంభై శాతం చచ్చిన నువ్వు ఎంతకని శాపిస్తావులే –

*(అముద్రితం)*





# అమ్మా! అసహ్యించుకోకు

వెక్కివెక్కి పడకుండా ఎలా వుండం ?
నువ్వొట్టి ఆగరు పొగగా మారిపోయినప్పుడు –
ఇంటి నిండా ఇసక రాలని ఇనుప మనుషులు గానో
కసి పేరుకుపోయిన కరకు హృదయాలు గానో
నీ అదృశ్య దుఃఖం అతుక్కుని వున్నపుడు –
నీ చల్లని చూపుల్లో
వెయ్యి గూళ్ళని వాళ్ళగుండెల కదుముకొని
విరిగిన కొమ్మలకి రెక్కల్ని కట్టుకోవాల్సొచ్చింది
కల్సికట్టుగా కన్నీళ్ళు కడుక్కోవలసిన మేం
కారణ్యం లేని కొయ్యలై
మాటలతో ముక్కలై పోవాల్సొచ్చింది
గుర్తు తెచ్చుకోకుండా ఎలా బ్రతకం ?
నువ్వు క్షమించని వేర్పాటుతనం
క్షణక్షణం వెన్ను జలదరింపచేస్తూంది
నువ్వు తట్టుకోలేని తలవంపు పన్లు
ప్రతి నిమిషం తలపుకొస్తున్నాయి
నువ్వు మౌనంగా మట్టిలో మోహం దాచుకున్నా
మరిచిపోని మెత్తటి మనసు మొత్తుకుంటూనే వుంది
ఇప్పుడింక వేదన పడం లే –

ఇంకెప్పుడూ తూట్లు పొడుచుకోంలే -

నువ్వు తట్టుకోలేవని తెలిసినా తెగతెంపులైన మేం

సగం చచ్చిబ్రతకం లే -

ఇంకెప్పుడూ ఇక్కడికి తెచ్చుకోలేని నిన్ను ఇక్కట్ల పాల్చేయంలే

నువ్వు మాత్రం వెనక్కి చూడకు

మళ్ళీ సజీవంగా

మా ముందుకు రాకు

నీ గుండె మళ్ళీ ఆగిపోగల్దు

*"ఆమె" ఆంధ్రభూమి డైలీ*

*12-07-1991*





# అమ్మా! నీకు అశ్రు అభినందనాలు

నువ్వెప్పుడూ మనుష్యుల్ని నమ్ముతానే వున్నావు

ఎప్పుడూ శాంతి మిగలదు నీకు

అన్ని తరహాల అబద్ధపు శాసనాలూ నిన్ను కట్టిపడేసేవే

పేకాట మైకంలో పుస్తెతెంపే చెయ్యి నీ చెంప పగుల గొట్టినపుడూ

నువ్వు మనుషుల్ని నమ్ముతూనే వున్నావు

నీ కనుకొలుకులు బాధని ఎండనీవు

నీ రెక్కల మాటున ఒదిగిన పిల్లలు నీ అడుగడుక్కి ముళ్ళు గుచ్చుతూనప్పుడూ

నువ్వు మనుష్యుల్ని నమ్ముతూనే వున్నావు

నీ మనసు పొరల్లో మౌనం మైనంలా పేరుకుపోయుంటుంది

నీ శరీరం గాయాల మయమైనా, తూట్లు పడుతూన్నా

నీలో మొండి ధైర్యం బ్రతికే వుంటుంది

అసలు నీ పిచ్చి గానీ, యిన్నీ ఎలా సహిస్తావు నువ్వు?!

అన్నీ సరే గానీ, అసలు మనుష్యుల్నెలా నమ్ముతావు నువ్వు?!

ఏ సంతోషం, ఏ వినోదం నిన్ను ముంచెత్తుతోందనీ??

ఏ విద్య, ఏ పరిజ్ఞానం ప్రబోధించిందీ కమిట్‌మెంటుని???

అంతా గూడులేని పక్షులైతే నీకేం?

పనికిరాని బండరాళ్ళయితే నీకేం?

నీ నిస్వార్థం యిక్కడెవ్వరూ గుర్తించనపుడు

నీ వాత్సల్యానికి విలువలేనపుడు

ఇంత రాక్షసత్వం మధ్య ఇంకా
నువ్వు మనుష్యుల్నెలా నమ్ముతున్నావు?
ఎప్పుడో ఓ అర్ధరాత్రి దుప్పటి ముసుగులో
ఏదొక చిన్ని గుండె నీకై వెక్కుతూనపుడు
ఇన్ని గంజాయిల్లో తులసి నీకై కాచుకుందని
ఆర్తిగా చన్నిచ్చి పెంచుతావు నువు –
తిరిగి రేపో పెద్దమనిషయ్యి నిన్ను నంజుకు తినడానికి ఆయత్త మౌతూన్నపుడు
నాకు తెలీ కడుగుతాను అసలు మనుష్యుల్ని ఎందుకు నమ్ముతావు నువ్వు?

"సాహిత్య వేదిక" ఆంధ్రజ్యోతి
*07-06-1990*



## ఐ.పి.సి. 302

ఎన్ని పద్నాలుగుల జీవిత ఖైదో కదా ఇది!
అమ్మా, నాన్న, అన్నా, చెల్లీ బంధాలు వదులు చేసుకుని –
ఈ ఒక్క కక్ష్యనే అంటిపెట్టుకుని ఉపగ్రహాన్నై –
ఈ ఊచల పటుత్వం చేతనుంచుకునీ
చేతులు ముడుచుక్కూర్చుంది నేనే
ప్రేమైక జీవనపు మత్తు పూసుకుని ఉక్కు తెరల వెనుక దాగుందీ నేనే
పగలంతా కలిపి ఈ రెండు గంటల విరామమే నా ప్రపంచం
ఈ తారీఖుల పట్టిక, ఈ అలారం ఇవే నాకు
కాలనియంత్రకాలు
రాత్రి చటుక్కున తెల్లబారే సరికి మళ్ళీ
ఈ గదీ, వసారా బిడాయింపు సెక్షనే
ఈ అంట్లు తోమి, గదులూడ్చి, బట్టలుతికి, ఇస్త్రీ చేసి, బియ్యమేరి,
కూరలు తరిగి, వంట చేసి, వడ్డించి
విశ్రమించబోయి మళ్ళీ శ్రమించే తనాలే
ఈ నిత్యావసరత్వపు సెంట్రల్ జైలుకి
లేని వెంటిలేటర్లనెక్కణ్ణించి తేను?!
ఎన్ని పద్నాలుగల జీవిత ఖైదో గానీ ఇది!!
అసహనాల్ని సహనాలుగా మార్చుకోవాలి
శాసనాల్ని సరిపెట్టు కోవాలి

అందుకోకూడదేమీ - అందించాలి
అప్రియాత్వాల్ని ప్రేమగా పరావర్తనం చెందించాలి
ఇన్నోటీ తట్టుకుని "ఇగో"ని పరిరక్షించాలి
సత్రాజిత్తు తమ్ముడన్నది నిజమేస్మీ -
ఓ పట్టు పట్టి చూద్దామని ఈ గోడల్లోకి ప్రవేశించాను
చెమ్మగిల్లిన మనసుకి జలస్తంభనం రానిదే
ముక్తి, మోక్షదారుల దార్లు తెలీందే
సేచ్ఛనివ్వలేని తనాన్కి వగచి
ఇచ్చుకోలేని తనాన్కి వొంగి పోయింది నేనే
ఈ మూడు ముళ్ళ తాడుతో గానుగెద్దునై నడుస్తున్నదీ నేనే
విడుదలలేని నేరస్తురాల్నై
సంవత్సరం సంవత్సరమూ బాధ్యతలకి బిగువుగా కుట్టేసుకుని -
పిల్లా, జెల్లా
చిగురాకులు, కొత్తతొడిమెలకీలోబడి -
ఎన్నో పధ్నాల్గుల జీవిత ఖైదు కదా ఇది!!!

*"ఆమె" ఆంధ్రభూమి డైలీ*
*05-06-1992*





# నిన్ను కోల్పోయిన క్షణాన

నేను నన్ను పోగొట్టుకున్నపుడు
జలతార మీంచి కవాతు జవానుల్లా
కన్నీళ్ళు జ్ఞాపకాల్ని కుమ్మరిస్తాయి
నేను సెంటీరియర్ల స్వగతాలుగా మిగిలిపోయినపుడు
గడ్డకట్టుకుపోయిన శిథిలాలు
రెక్కలు టపటపలాడిస్తాయి
వదులుకోలేని వెయ్యి కశలాలుగా నువ్వు నన్నుతుక్కుపోయి వున్నప్పుడు
గుండె గోడకొట్టిన చిత్రపటమై గిలగిల్లాడుతున్నపుడు
నేను పొడిరాలని పరిమళాన్నై
కలల సమాధి ముందు కళ్ళు మూస్తున్నపుడు
విస్తరించని వసంతాన్నై కురవని మేఘాల కోసం పడిగాపులు కాస్తున్నపుడు
అశక్తఅణువులు ఛెళ్ళున అన్ని తలుపుల్నీ మూసేస్తాయి
ఇప్పటి వరకూ రాని నిన్ను ఇంకెక్కడికో విసిరేస్తాయి
నేనెన్ని రాత్రిళ్ళు, పగళ్ళు రోదించినా

*"కంజిర"*
*డిసెంబరు 1992*

# నువ్వే లేకపోతే...

నీ గుప్పెడు గుండె కొట్టుకోకపోతే –
నెర్రైఉ చాచిపోయిన కళ్ళని చిగుర్చుకోలేం మేం ఎప్పటికీ –
బిగబట్టుకు పోయిన రక్తాన్ని పరిగెట్టించలేం
ఉత్తి ఖాళీ మైకా సంచుల కాలాన్ని
బాదుకునీ బాదుకునీ బతుకుని ముక్కలు చేసుకోవటం తప్ప –
ఇన్ని మొండి మనసుల్ని
నీళ్ళు మిగలని తనంతో తడుంకోవటం తప్ప –
నీ స్పర్శ అందక పోతే –
ఎండిపోయిన నోళ్ళని పూయించలేం ఎప్పటికీ –
స్ఫటికాలై పోయిన శరీరాన్ని ద్రవ పదార్థంగా మార్చుకునీ మార్చుకునీ
కెరటాల్లో ఉరేసుకోవటం తప్ప
నువ్వనే పదం కన్పడకుంటే –
అమ్మా! బిక్కు బిక్కు మని నిట్రాట గోడలకి చేరేసిన
వక్రపు నడాలవ్వటం తప్ప
పీకల్లేని మొండాల్ని కొయ్య మెదళ్ళతో బలవంతపు అడుగులేయించటం తప్ప
తెల్లారి పోయే దాకా –
నిన్నెలా దక్కించుకోవాలనే దీర్ఘపుటాలోచన తప్ప
విరగలేకా కరగలేకా
వెక్కిళ్ళలో నీ ఒడిని అందుకోలే కా, అందుకోలేకా

"ఆమె" ఆంధ్రభూమి డైలీ
*27-09-1991*





# నువ్విపుడు

ఇపుడు నువ్వే వెలుగునీ ఉరి వేయక్కలేదు
అవహేళనల్ని అమిత వ్యథతో అదుముకోనక్కరలేదు
నీ రెండు జళ్ళ నిస్సహాయత్వం నిన్ను నిలువునా ముంచక్కరలేదు
నువ్విపుడే మీ వినక్కరలేదు
కసిగా నువ్వు పీకేసిన ఊపిరి ఒర ఫెటేలు మంటున్న చప్పుడు తప్ప
శరీరమే లేని నీకు సగం నెలలంటగట్టి సంతృప్తి పడ్తారు వీళ్ళు
నువ్వు మూయించలేని నోళ్ళతో ముసిముసిగా నవ్వుతారు వీళ్ళు
ఎప్పుడూ పరికించి, పరామర్శించని పరమాత్ములు కూడా పదే పదే పేల్తారు
నిన్ను నిశ్శబ్దంగా కలిపేసుకున్న దుమ్మూధూళీ
దుమారాన్ని లేపుతుంది గానీ దుర్మార్గాన్నాపదు
ఇప్పుడు నీ వాసన కూడా మిగల్దు
నీ కౌగిలిని కల్లో ఊహించుకున్న వాడూ నీ కోసం వేదన పడడు
తీయతేనియలొలికించిన వాళ్ళు తప్పనిసరైనా తల్చుకోరు
నిన్ను ఒకంతట మర్చిపోనని ప్రమాణాలు చేసిన వాడూ
మొహమాటానికైనా మథనపడడు
ఎవ్వరూ –
ఇప్పుడు చప్పబడిపోయిన బూడిదలో నీ చిర్నవ్వు వెతుక్కోరు
నీ కన్నీళ్ళతో బరువుగా వేళ్ళాడుతున్న చీకటి మాత్రం
కరుణించి నిన్ను కలుపుకుంటుంది
ఇప్పుడన్ని బాదలూ బలాదూర్ నీకు

నీ దుఃఖమైనా దిగదుడుపే
నువ్వడ్డుతగలని దుష్ట ప్రపంచం తగలబడి పోయినా
ఫోటోఫ్రేము తడవనివ్వవు
చిక్కులెన్ని ఛిన్నాభిన్నం చేసినా చెక్కుచెదరవు

*"ఆమె" ఆంధ్రభూమి డైలీ*
*12-04-1991*





# ఒక్కల

విస్మృతిలోనూ స్పృహతోనే ఎలా ప్రవర్తించగలం?
నా అర్థస్వప్నాల్ని నా నించి బయటికి పోకుండా ఎలా కాపాడుకోవడం?
చటుక్కున ఊమే వాస్తవంగా తోస్తుంది
ఆ నాలుగడుగులూ -
మెదడుకే గంతలు కట్టుకున్న నిజసత్యాలూ -
గిల్లేంత వరకూ అర్థం కాని కుతూహలమూ-
స్మృతిలో కొచ్చేంత వరకు ముసుగులుండవు లొసుగులుండవు
అదొక విశ్రాంతి మైదానం -
ఒక గంభీర గృహం -
భయయవిహ్వలత -
అపనమ్మకపు నదీలోయా -
ఉండేదల్లా నేను
పారిపోయేవి "నువ్వు"లు
అన్వేషణ, ఉత్సుకత, జిజ్ఞాస కలిసి రంగరించి పోయి
మాట్లానిస్తాయి
చేతలాడనిస్తాయి
నాకేమో నేనొక ఖచ్చితార్థ ప్రవర్తనా శీలిని
పరులకేమో ఓ వెర్రిబాగులతనాన్ని
పిచ్చిదాన్ని

ఎలా గాఢ సుషుప్తిలోనూ ఆలోచన్ల కళ్ళేలు దగ్గరుంచుకోవడం?

ప్రొద్దున్నే ఛెళ్ళున తగిలే కొనల్నించి

ఎలా మనసు జాడలు పడకుండా కాపాడుకోవడం?

తెలిసుంటే చేస్తారా ఎవరైనా?

నాకు మాత్రం నవ్వు మొహమే పెట్టుకు పల్కరించాలని తెలీదూ?

ఎన్నింటిని మానుకోవాలి నిద్రతో సహా?

అయినా గుట్టుతనం వుండొద్దూ?

ఎవరి బెంగల్నీచ బేవార్సుతనాన్ని

వాళ్ళే అదుపులో పెట్టుకోవద్దూ!

అన్నిటికీ ఒకటే మాత్ర -

స్మారకం లేని అపస్మారకయే

*"సాహిత్యవేదిక" ఆంధ్రజ్యోతి డైలీ*

*22-06-1992*





# ఓ రోజంతా...!

నేను తిరిగొచ్చేవరకు నా గదిలో

తిరగేసిన పుస్తకం, బూజుపట్టిన బల్ల,

కొక్కానికి వేళ్ళాడే గొడుగు అలానే వుంటాయి

నేను తాళం తీసే చప్పుడూ, వేసే చప్పుడూ గమనించనట్టే నటిస్తూ వుంటాయి

నేను అడుగులన్నీ దాటి బురద సీమల్లో

ముందు ముందుకు కదలి తిరిగొస్తూంటాను

దారిలో ఎవరింటి ముందో ఇంటి కోడలు ఎప్పటిలాగే

అందంగా ముగ్గులు వేస్తూంటుంది

రాత్రంతా తాగి తందనాలాడిన భర్త

చివాట్లూ, ముద్దు శృంగారాలు మరిచిపోయి -

డాక్టరు ఠంచనుగా రిక్షాలో సాగిపోతూంటాడు

స్వీట్ల బండి వాడు బండి కదుగుతూంటాడు

టీ బడ్డీ దగ్గర జ నం ఎప్పటిలాగే హడావిడి పడ్తూంటారు

ఇలా గడచిపోతుంది రోజంతా ...

బడికెళ్ళే కుర్రాణ్ణి వాడి బరువైన సంచి ప్రశ్నలడగదు

అరుగు మీద కూర్చుని తీరిగ్గా మీసాలు సవరించే పెద్దాయన్ని చేతులడగవు

చంటి కుర్రాణ్ణి లాక్కెళుతూ బిందె మోసుకెళ్ళే ఇల్లాల్ని కాళ్ళడగవు

వీళ్ళందరూ ఎప్పటిలాగే రోజంతా గడిపేస్తుంటారు

ప్రొద్దునే నోట్లో వేలుపెట్టుకుని ఊరంతా

రౌండ్లు కొట్టే రెండేళ్ళ గుండుగాడూ

తీరిగ్గా చిన్నాఫీసులో ముడిచిపెట్టు కూర్చున్న హెడ్ క్లర్కు
రోజంతా కుక్కి మంచంలో ముసుగెట్టి మూలిగే ముసిలాడు
ప్రొద్దున్నే పరిగెట్టే పోస్టుమేనూ
వీళ్ళందరికీ రోజంతా ఒకేలా గడుస్తుంది
గది కిటికీలోంచి లోపలికి తలొంచే రాధా కృష్ణా
నేనూ వున్నానంటూ పెనవేసుకుపోయే సన్నజాజీ
ప్రొద్దున్నే లేచి చూరుపక్కనే ఒళ్ళుదులుపుకునే పిచ్చికపిల్లా
రాత్రి కురిసిన వర్షాన్కి తడిసిన వొంటిని ఆరబెట్టుకునే మల్లెమొక్కా
నన్ను కాస్త బయటకు సాగనంపుమనే గది నేలమీద దుమ్మూ
ఇక నా పనయ్యిందంటూ విశ్రమించే గోడ కూన్నబల్బూ
మాకు రోజు మొదలయ్యిందంటూ కావు కావుమనే కాకులూ
ప్రొద్దున్నే బద్ధకంగా బయలుదేరే బండెద్లూ
ఈ రోజెలా గడస్తుందోనని దిగులు పడే ఈ మనసూ
ఇవన్నీ ఈ అసంపూర్తి కవితలా ...

*"సాహిత్యవేదిక" ఆంధ్రజ్యోతి డైలీ*
*10-10-1988*





# పాపా! నువ్వేం పాపం చేసావు?

దేవుడూ! ఏం చేసేరు వీళ్ళంతా?
ముందెప్పుడో నీ మాట నిర్లక్ష్యం చేసో –
నూరేళ్ళూ సంతోషంగా గడిపేసో –
తెలీక చేసేరనుకో –
ఇప్పుడు చూడు
ఈ మెదళ్ళ వయసెప్పుడూ మూడేళ్ళే
కన్నతల్లికెప్పుడూ కడుపునిండా కన్నీళ్ళే
సొంతమని చెప్పుకోలేకా...
పరాయిదని ఒప్పుకోలేకా...
కొన్ని కనుగుడ్లెప్పుడూ లక్ష్యం లేకుండా తిరుగాడే చేపల్లానో
దేహాలు పట్టు తప్పిన కొయ్యకుర్చీల్లానో
ఎప్పుడూ అయోయమయత్వపు ప్రపంచాన్నంటిపెట్టుకునీ –
అమ్మ గూడుని వెతుక్కోలేనప్పటి పిచ్చికపిల్ల అస్థిమితమూ
శోషొచ్చినప్పటి శబ్దరాహిత్యమూ
ఒంట్లో భాగాలై –
శరీరం పిప్పయి పోయినా అతుక్కోగలమే !
ఎంత తెగిపోయిన మనస్సయినా దారి మళ్ళించుకోగలమే!
దేవుడూ! అపసవ్యత్వాన్ని అతి సులువుగా ఎలా పెట్టెయ్యగలిగావు తలల్లోనికి?
సగంసగం నాడుల్ని తెంపేసో

సక్రమంగా పని చెయ్యనియ్యకో
ఎలాగ మర్చేసేవు అంత తెలీకుండా?
ఎప్పుడో మనుషులుగా, మనలా బతకాల్సిన వాళ్లు
ఇంకా నవ్వుకీ, ఏడుపు కీ తేడా తెలీదు చూడు
అసలు తామెవ్వరో తమకే ఆనవాలుండదు
ఒక్కసారాగు దేవుడా!
వాళ్ళకి గుండె నిండా స్పర్శనివ్వని నువ్వు
ఇప్పుడు మాకు గొంతుక్కింత వరకు ఎగిసిపడుతూన్న నీళ్ళెందుకిచ్చేవు?

*("అంజలి"ని చూశాక)*

*"రచన" ఫిబ్రవరి 1992*





# పండగొచ్చినపుడు

పండగొచ్చిందంటే
జడ గంటల స్పర్శనాకు జీవితాన్నిస్తుంది
తొలిప్రొద్దు నాకు తలపుల్ని నేర్పుతుంది
తెల్లారే ఇంకా విరియని వెలుగుల చాటు
నడివాకిట పావడాల్ని పాదంపైకి దోపి
పవిటలు సరి చేసుకుంటూ
మురిసిపోతూ ముగ్గులేయడం
అల్లరి బావలు అంత ప్రొద్దున్నే లేని నిశ్శబ్దపు నవ్వులతో
మెట్లమీంచి దొంగల్లా చూడడం
కుంకుడు కాయ పులుసుపడిన కళ్ళని నులుముకుంటూ
నాలుగో పిన్ని నలుగు పెట్టి ఎర్రబెట్టిన లేత చర్మాన్ని
ఇంకా నలుపుకుంటూ
తిరిగేబుడిబుడి చంటోళ్ళ కేరింతలు
అన్నీ వరదలా ఒక్కుమ్మడిగా ముంచుతాయినన్ను –
గాడిపొయ్యి దగ్గర గడాబిడగా అరిసెలొండే అత్తయ్యా
ముందు రాత్రి వెన్నెల్లో ముసిముసి నవ్వుల్లో
మాటల మాలలు తురుముకుంటూ
నడిచెరువులో నిర్భయంగా నీళ్ళకు దిగే పడుచు పిన్నిలు
ఇంత సందట్లోనూ ఇంటి మూలనో చోట కనిపెట్టి
పేకముక్కల్లో పండగ వెతుక్కునే ఇంటల్లుళ్లు

లెక్కలేకుండా ఆడిగినవీ, అడగనివీ అన్నీ తెచ్చియిచ్చే తెల్లమీసాల తాతయ్య
అందరూ వెర్రి ప్రేమకి వెయ్యి రూపాల్లా
అంతులేని ఆప్యాయతల్ని పంచుకుంటూ అగుపిస్తారు నాకు –
చెడ్డీలేసుకు చెంగుచెంగున గెంతే వాళ్ళనించి
చెంగావి చీరల్లో చుక్కల్లా మెరిసే వాళ్ళ వరకూ చిరునవ్వులు చెరగవు
అవని నించి ఆకాశం వరకూ ఆనందమే అలుముకుంటుంది
హరినామస్మరణలో బ్రహ్మాండాన్ని చుట్టేసి హరిదాసు
కాళ్ళలోకి సూదంటు రాళ్ళు గునపాల్లా గుచ్చుకుంటూన్నా
గుంజీలు తీస్తూనే వుంటాడు

కాగిపోయే ఎండలో కాలేకాళ్ళతో
కష్టాన్ని కూటి కోసం కోటి రాగాలుగా మలుస్తాడు గంగిరెద్దువాడు
శంఖారావంలోనే శక్తి ఉడిగిపోయిన ముసలి జంగం
ఇంకా జబర్దస్తీగా జీవితాన్నడుక్కుంటూంటాడు

ఇదేమీ పట్టని పెద్దింటి పెద్దలు
పోతు మేరకల్ని ఫెళఫెళా లాక్కొచ్చి
సంబరాల్లో సఫా చేసి పకపకలు చిందిస్తూ పొట్టల్నిండా పట్టిస్తారు
కారుణ్యం లేని కళ్ళతో కోళ్ళకూ్కడా కసినేర్పి
కడ ఊపిరిదాకా కడు ఉత్సాహంతో ఉరకలేయిస్తారు
అన్నీ యిచ్చినా ఇంకా అలకలకుపోయే ఆడపడుచులు
కంచాల దగ్గర కయ్యాలకు దిగే కొడుకులు
చీపురు పూతికల్లా చివుక్కుమనిపిస్తున్నా





పెద్దల్నించి పిన్నల్దాకా ప్రతి ఒక్కరినీ పలకరిస్తూ
నవ్వులు రువ్వే పాలమనసున్న అమ్మమ్మా
పరిధిలేని పశు ప్రేమకి నిదర్శనంగా
పసిపిల్లల్తో బాటూ పరుగులెట్టే లేగదూడా
గుమ్మం మీద వెన్నుల్ని గప్‌చిప్‌గా పెరుక్కెళ్ళే గువ్వపిట్టలూ
అన్నీ ... అందరూ ....
నిజంగా రంగు రంగుల రోజులు
సరదాల్తోటీ, సాధింపులతోటీ
అందంతోనూ, ఆకతాయితనంతోనూ
అన్నీ కలబోసిన అపురూపంగా తోస్తాయి నాకు

*"ఈ వారం కవిత" ఆంధ్రజ్యోతి వీక్లీ*
*18-01-1991*

# అమ్మను నేను

అమ్మని రా నేను

నీ దుఃఖభాజకాల

ఆకలి దప్పికల

జీవితాంత వేదనల ఓదార్పుదారుని

నీ లాలీ పాటల, దోబూచి చందమామల

పాలమీగడల పసితానాన్కి తల్లిని

నీ చిన్న నవ్వులో నా బ్రతుకు హాసం విరియ వస్తుంది

నీ బోసిబోసి కబుర్లు నా చేయందుకుని నాకే మాటలు నేర్పుతాయి రోజంతా

నీకు పాలిచ్చి, లాలపోసి, కడిగి, తుడిచీ, గుడ్డలుతికీ

పరిపూర్ణానందాన్ని అనుభూతించే మాతృత్వాన్ని నేను

నా జీవిత గమ్యాలన్నీ నీ చుట్టూ అల్లుకుని

నిన్ను పెంచడమే లక్ష్యంగా చేసుకుని

తెల్లవార్లూ నీకైశ్రమించే పని ముట్టుని నేను

నా గుండె లాలిత్వం పారదర్శకమై నీలో ద్యోతకమౌతుంది

నా సున్నితప్రేమ, వాత్సల్యం అనుక్షణానికీ అధికమైన నీ వెంటే పరిశ్రమిస్తాయి

నీ బుజ్జి తలను నిమిరితే చాలు

నా జీవిత విషబాధలన్నీ తీరిపోతాయి

నీ చిన్నారి బుగ్గలు, అందాల బుల్లి బుల్లి కళ్ళు నాకు ఆప్యాయాలు





అతిచిన్ని వేళ్ళు, పాదాలు, బంగారు ముక్కు – ఇవే నా ప్రపంచాలు

నేన్నీకు అమ్మనిరా

ఏ బతుకు గండాలూ దరిచేరనివ్వను

ఏ మరుపుతో  ఎన్నడూ నీకన్యాయం చెయ్యను

నా నించి నీకు జీవితాంతం

నా గుండె క్షీరధార ప్రవహిస్తూనే ఉంటుంది

నన్ను, నిన్ను అనుబంధపు అదృశ్యనాడులు ఎప్పుడూ కలుపుతూనే వుంటాయి

నువ్వు నా దుఃఖాన్ని బోర్లా తీప్పేవు నాల్గోనెల్లో

నన్నూ ఆనందంలోకి పాకనిచ్చేవు ఆరోనెల్లా

నా చిన్ని తండ్రీ! నువ్వు దినదిన ప్రవర్థమానమై

నా బతుకు తప్పటడుగుల్నీ దిద్దుతావు

హాయైన కాలాన్ని నా కిచ్చి నన్ను పరుగులెట్టనిస్తావు

నిన్ను పెంచీ, నీ పిల్లల్ని పెంచి – ఒక సార్థకాన్ని నాకిస్తావు

నాన్నా! నీ అమ్మను రా నేను

నా తండ్రీ! ఏడవకు

"ఆము"తిని బుద్ధిగా బజ్జోవాలిరా

చక్కగా చదువుకుని లోకాన్ని నడిపించాలి

అమ్మని రా నేను

నీకు చిన్న గాయమైతే నా గుండె తూట్లు పడిపోతుంది

ఏ మాత్రపు ఆక్రందనైనా నా రక్తప్రసరణాన్ని ఆపేస్తుంది

నా బంగారు తండ్రీ!

నా బంగారు తండ్రీ!

నీ చీకట్ల, నిస్సహాయితల, నిరాశల పారద్రోలే దీపాన్ని నేను

నీ వసంతాన్ని కాపాడే ప్రప్రథమ వృక్షాన్ని నేను

నీకు అమ్మను నేను

*"ఈ వారం కవిత" ఆంధ్రజ్యోతి వీక్లీ*
*19-05-1995*





# "బంగాళా"ఖాతం

అంకెన్ని ఎదురు చూపుల వ్యర్థ ఘడియలు!!!

ఈ అతి పెద్ద సురక్షా పంజరాల్లో అన్నీ వుంటాయి

సౌఖ్యానికి నిర్వచనం –

సౌభాగ్యానికి సిసలు వ్యాకరణం –

కళ్ళు తెరిచిందగ్గర్నించీ అజమాయిషీల చేతికర్ర దారి చూపిస్తుంది

ఇంటి నలంకరింప జెయ్యడం

తోట నలంకరింప జెయ్యడం

పిల్లల ఆయా మీదా –

డ్రైవర్ల బతుకుల మీదా –

వంటవాడి స్వార్థం మీదా –

అన్నీ, సమస్తం వుంటాయి

రాజకీయాలు, మహిళా సమావేశాలు

దేశ సమస్యలు, ప్రజాందోళనలు

నగానట్రా, చీర్లమోజు

అబ్బబ్బ అన్నీ వున్నాయి

పడగ్గదిలో కాళ్ళు ఒత్తడాలు –

శుక్రవారపు పాతివ్రత్యాలు

చీర కుచ్చిళ్ళ ప్రక్కన అరకేజీ తాళాల గుత్తీ

విదేశీ చెప్పులు –

ఉండక ఛస్తాయా!

నా ప్రపంచమే తన చుట్టూ అల్లుకున్నాని అరవలేని తనం
పూటపైటా పీకెదాకా బిగించే వెగటు మాద్యం
వొప్పుకోకూడదన్న కాంక్ష
ఒక్క రోజైనా అర్థ రాత్రికి ముందే
యౌవన వేశ్యా సాంగత్యాన్ని నివృత్తి చెయ్యాలన్న తలంపు
ఓహ్ .......... అన్నీ వున్నాయి
పిల్లల తల్లిని చేసి తప్పు నా మీద నెట్టివేసే దగుల్బాజీ వైఖరి
సినిమాకైనా బైటికి తీసికెళ్ళని పనికిమాలిన స్టేటస్సు
రెక్కల్ని విరిచి మరీ తలుపులు తీసే నికృష్టబుద్ధీ
అన్ని సులక్షణాలూ వున్నాయి
క్రూర వినోదాలకి అంతర్గత శరీరం అయిపోయింది
బూతు పారాయణానికి మనసు కర్ణబేరి మొదటికి తెగి పోయింది
రాగాల సరాగాల సంసారం ఒక్కనాడూ అనుభూతికి రాలేదు
ప్రేమ ఎక్కడుందో మచ్చుకైనా తెలీలేదు
ఇక్కడ ప్రాముఖ్యత లేనిది
ఇంక వుండలేనిది కూడా వుంది
– నేను

"నీలిమేఘాలు" సంకలనం



# ద్రవభాష

పోయిన మంచు కవాటాల మసకబారిని నిష్క్రమణమే మిగిలింది
మనిషిని చెరిపేయడమెంత అనితర సాధ్యం!?!
చీకటి వెలుగుని, వెలుగు చీకటిని దొంగతనంగా దాచిపెట్టగలవా!
ఈ రెప్పలెంత కఠినమైనవి!!
నిజాన్నీ, అబద్ధాన్నీ ఒక్కేలా దుఃఖించాలి కదా!
నాకు తప్ప అర్థం కాని రహస్య మందిరం నించి
మొదలే పాతుకుపోయి కళ్ళొత్తుకోవడం తప్ప ఏం తెల్సు నాకు?
చిత్రంగా నీకూ కాళ్ళిప్పుకుంటే చేతులూ
చేతులిప్పుకుంటే కాల్భూ కట్టేసే వుంటాయి –
ఎప్పటికప్పుడు ఈ లబ్ డబ్ ల పాడు యంత్రాన్ని
కాస్సేపు ఉరకనిచ్చీ, కాస్సేపు మూల్గనిచ్చీ –
రెక్కలైనా లేవే!
ఇంత ఆత్మస్థయిర్యం ఎక్కణ్ణించొచ్చింది?!?
బతుక్కాల మంతా నాదాల్నీ, లయవిన్యాసాల్నీ మార్చి మార్చి ముద్రించుకుని
ఇంకెంత మోచేయి చాటున నీరైతేనేం?!
సమయా సమయాల్ని వీక్షించగలం కానీ శాసించగలమా!?
సువాసనల, దుర్గంధాల,
వసంతాల, శిశిరాల రోజులన్నీ నిద్రించేందుకెళ్ళాయి

కళ్లు విప్పేసరికి కొత్త కొలకొలా రావాల
ఒక్కొన్ని ఎదురౌతూనే వుంటాయి
అయినా రాసిపోగబండి మిగులు కోసం
శ్వాస పట్టాల చివర్నించి ఎంత కని ఎదురు చూపు!?
అసందిగ్ధ భారాన్ని జీవితమంతా
ద్రవభాషలోనికి ఎంతకని అనువదించుకోవటం!?
రాసి స్వప్నాల్ని సంఘర్షణలుగా ఎన్నని తర్జుమా చేసుకోవటం?
విస్మరణ లతనై ఎంతకని వెన్నెముకలేని విక్రమార్కత్వాన్ని ప్రదర్శించడం?
మమతల మాలికల్ని ప్రదర్శించే దారానికెంత నగ్నత్వం!
కించిత్ కోమల బంధానికే కళ్ళు మూసుకుంటాం
ద్వారాన్నంటిన ఐహిక ఆవేదనే మిగిలింది చివరికి
అంతరంగాల్లో నిష్ఫలాతాన్వేషణ ఇంకెంత కాలం?!?
తెర వెనుక ప్రగల్భాల, మౌన ప్రతీక్షల
అంతర్యుద్ధమే మిగిలింది చివరికి

సుప్రభాతం
*20-08-1992*





# ఏడుపాయల ఖిల్లా

సముద్రం భూమ్మీద, భూమి సముద్రమ్మీద ఆధారపడినట్లు
గంభీరతాన్ని విదిలిస్తూ వర్తమానం మధ్య
రంగుల ఆకాశం కప్పుకుని నిల్చొని వుంటుంది ఖిల్లా –
వసంతాలొస్తాయి, వానలొస్తాయి
ఊరు మారుతుంది, మనుషులు మారుతారు
దుర్భేద్యంగా, నిశ్చలనంగా, స్థాపువులా నిల్చేది ఒక్కటే ఖిల్లా –
ముళ్ళకంపల కాలిబాటల్ని తప్పించుకుని
మెట్ల మీంచి సైనిక బురుజుని
మిగిలిన ఒకే ఒక్క ఫిరంగిని మోసే రాతి ప్రాకారాన్ని
అంత ఎత్తులోనూ హృదయాన్ని నిరూపించుకున్న
రాతి గుండె చెమర్చినట్లున్న పాకుడు నీటి పాలబావిని
గత రహస్యాల్ని తామే అంతరాంతరాల్లో మార్చుకునే శిథిల కట్టడాల్ని
కదిపితే అనుభూతి రక్తంలోంచి పాకి
వెన్నులోంచి మెతుకు సీమ వెతలు కదిపి
తెలంగాణా పౌరుషగాథని ఆవిష్కరింపజేస్తాయి
ఇక్కడ శిథిలమై పోయింది గత మొక్కటే కాదు
ఖిల్లాని పట్టించుకోని మర మనుషుల వర్తమానం కూడా
సైనిక శిభిరాన్ని తలదన్ని, రాణి వాసాన్ని తలపింపజేయని
తలుపుల్లేని ద్వారాల అంతర్భాగాలు చూసినప్పుడల్లా శతాబ్దాల్ని
వెనక్కితిప్పుతాయి

వైభవం లేని చోట వేయి పడగలు పంజా విప్పుతాయని కాబోలు
వైర్‌లెస్ పహారాలైటు రాత్రి మసీదులోంచి శిఖరాగ్రాన
దేదీప్యమానంగా ఖిల్లా ఉనికిని కాపాడుతుంటుంది
వెన్నెల్లో ఖిల్లాని చూసినప్పుడల్లా
అప్పుడెప్పుడో ప్రేమకు బలైపోయిన యువజంట
ఏకైక సజీవ సమాది లా అగుపిస్తుంది
దహించే హృదయాన్ని చల్లబరిచేందుకు ఈ గడ్డ మీద
అమ్మకి ఓ స్తన్యంలా ఖిల్లాయే లేక పోతే
జీవితం ఊరు లాగా అర్థం లేని అన్వేషణై పోదూ!!
విరిగిపోయిన గతాన్ని దాచుకునీ గుంభనంగా నిలబడడం రాకపోతే
ఏమీలేని ఈ ఊరిలో ఆకురాలీన వృక్షాల్లో
ఈ ఖిల్లా కూడా ఒక్కటై పోదూ!!!

*(అముద్రితం)*





# జాబిల్లి పొదరిల్లు

నేస్తం లేని చోట జాడలున్నాయిగా
జ్ఞాపకాల ఊలుని అల్లుకుంటూ పొదరింట్లోకి అడుగుపెట్టాను
కుందేటి యింటిలో పిల్లి పిల్ల ముడుచుకుని వుంది
అతిథి గదిని శయన మందిరం చేసుకుని
నీ కళ్ళద్దాల స్పర్శని ముద్దాడే పుస్తకాలు భాషాభేదం లేకుండా
చెట్టపట్టాలేసుకుని నిక్కి నిక్కి చూసాయి
అసలు గడపకివతల చెప్పుల "మాస్టర్ ఈజ్ ఇన్" అని చెప్తేనే
తలుపు గుండని తట్టేను
సామాన్ల గదుల్లోంచి నెమ్మదిగా మనసు పొరల్ని చీల్చుకెళ్తున్నట్టు
వెళ్తుంటేనే గమ్మత్తైన అనుభూతి
అక్కడెవరో నిన్ను స్వంతం చేసుకున్న వారున్నారు
వుండనీ – నేను పూల చెట్టు క్రింద కాసిన్ని పూలేరు కుందుకు
మాత్రమే వచ్చాను
చెట్టుతో నాకేం పని ?
ఈ గోడల్లో నిరంతరం ప్రతిధ్వనించే గంభీర స్వరం
నీ ఆజ్ఞ కోసం ఎదురు చూస్తున్న సైనికునిలా వుంది
నీ పాదాల్ని హత్తుకునే ఈ నేల ముద్రల్ని చర్మానికేసి కుట్టుకుని
మామూలుగా కన్పించడాన్కి విశ్వ ప్రయత్నం చేస్తూంది
జాబిల్లి కూనల ఫోటోల చిర్నవ్వులతో
ఎక్కడా ఆరని నీ జ్ఞాపికల గురుతులతో

ఆగరు పొగ కమ్మినట్లు
మనసు శరీరాన్నించి వేరుపడి గదుల్లో విహంగంలా తిరుగాడింది
మెరిసే నీ చూపుల్లే కున్నా కళ్ళద్దాలున్నాయి
ఉక్కిరిబిక్కిరి చేసే వాక్ప్రవాహం లేకున్నా కవిత్వం ఉంది
అతి మామూలు పెంకుటింట్లో నీ జ్ఞాపకాల వెన్నెల వుంది
నేస్తం లేకున్నా జాడలున్నాయిగా –
జ్ఞాపకాల ఊలుని ధరించి బయటకు అడుగు పెట్టాను
చిత్రంగా పొదరిల్లు నా వెనకే వచ్చింది
నా గదిలోకి జొరబడి నన్ను కుదిప కుదిపి
మనసు కలం నించి కాగితం పైకి దుమికి
అక్షరాల హర్మ్యంగామారింది

*(అముద్రితం)*





# జ్ఞాపకాల నదీ సాగరం

నది ఆనకట్టయి హృదయాన్ని సముద్రంలా విశాలించిన స్పర్శ –
నీళ్ళ వెంట లాంచీ కళ్ళతో పెరుగెత్తి
మెట్ట మీంచి నాగార్జున కొండ రాళ్ళల్లోనికి ప్రవేశించి
అణువణువునా
"బుద్ధం శరణం గచ్ఛామి.........."
"బుద్ధం శరణం గచ్ఛామి.........."
భాష లేఖనలో వంపులు మారినట్టే
శిలలూ కాలంతో పాటూ ఆకారాల్ని కోల్పోయాయి
మనసుల్లో గడ్డ కట్టిన దుఃఖాలెన్నున్నా
తాత్కాలిక ఉత్సాహం ఉరకలెత్తించినట్లు
మ్యూజియం పదిలాలన్నీ చెదరిన జ్ఞాపకాలు
చల్లని రాత్రి హిల్ కాలనీ మీంచి
పరిమళాల మల్లెల్లా సాగర్ పిల్లగాలులు
ఎక్కడా వెకిలీతనం మనుషులకే పరిమితమైన
జంతు లక్షణంగా అడుగడుగానా మృగాలు
సాఫీ జీవనం వెనుక గంభీర గతాన్ని దాచుకున్న కృష్ణా జలాలు
అక్కడ నది ప్రేమికుడై ఉక్కిరిబిక్కిరి చేసిన అనుభూతి
క్షణాలు చేజార కుండా దోసిలితో పట్టి గుండె నింపుకున్న ఆనందానుభం –
మూసిన కన్రెప్పల్లాంటి చెక్కిన నునుపైన నీటి ప్రవాహపు పక్కతలాలు

తియ్యటి మంచి నీరులా స్వచ్ఛమైన భోజన వసతుల పరంపర
డబ్బెందుకు మిగుల్చుకుని –
ఓ సారైనా ఈ నీటి పాదాలపై తలని ఆన్చలేనపుడు –
రెండు నీటి చుక్కలు కాదు
మనసుని ఎత్తిపడేసే ఎత్తిపోతలని శిరస్సుపై జల్లుకోలేనపుడు
వెచ్చనవుతున్న ఫిబ్రవరిని చల్లని దుస్తుల ప్రయాణం
దారి పొడవునా ఆపి శ్రాంత అనుభూతుల జల్లులతో –
అక్కడ నది యంత్రాన్ని మనిషిని చేసిన ఆనవాలు –
మనుషులెంత అద్భుతాల్ని సృష్టించగలరు!?!
ఆయాసపడి వెళ్ళడంలో అర్థమే లేకపోతే జీవితమెందుకు!?!
మరణంలో కూడా జీవితాన్ని చూపించగల
ఆచార్యుని జ్ఞాపికలు శిలలైపోయిన మనస్సుల్లో అంతర్లిఖితమై వుంటాయి
"బుద్ధం శరణం గచ్ఛామి.........." – "బుద్ధం శరణం గచ్ఛామి.........."
శ్రవ్వకాల వెడల్పయిన ఇటుకల నిండా అస్తిత్వాన్ని నింపుకున్న
బోధనల సారం క్రీస్తు పూర్వాన్కి సెకనులో తీసుకెళుతుంది
గన్నేరు పూలని, బోగన్ పిల్లాల అమాయకత్వాన్ని
తలలొతురుముకున్న విదేశీ బుల్లి వీడియోలలో బంధించుకెళ్ళగలిగిన
స్వంత భారతీయత్వం హృదయాన్ని ఉప్పొంగిస్తుంది
నది ఎక్కడైనా జలపాతమై, సముద్రమై
అద్భుత కలలాగా మస్తిష్కంలోకి చొచ్చుకెళ్ళడం చూసేరా ఎవరైనా!
నేను విన్నాను –



ఆ శబ్ద సాంద్రతని గుండె చప్పుడు బిగబట్టి
నేనున్నాను –
ఓ నలభై ఎనిమిది గంటలు
అత్యద్భుత జీవన చలిత సౌందర్యాన్ని వీక్షిస్తూ –
నది – సాగరమై, నదీ సాగరమై ప్రవహిస్తున్న జ్ఞాపకాల్ని ఒడిసిపడుతూ –

*(అముద్రితం)*

# ఖడ్గ చాలనం

కవిత్వం గురించి మాట్లాడడం అంటే –
నిద్ర నటించే వాళ్ళని నిద్రలేపడం అంత కష్టం కదా
ఎంతగా కవితాత్మని కాలం నిండా కుదించుకున్నారో కానీ
నిరంతరం జ్ఞప్తికొచ్చినవి వొచ్చినట్టల్లా
సముద్రపు అలల్లా ఎదుటివార్ని ముంచెత్తాల్సిందే
"సావిత్రి" చలం కలం లోంచి కాదు
ఈ గొంతు నించే పుట్టిందేమో
"కపిత్వమైనా" కవిత్యమయ్యేది
ఆ హృదయంలో ఘోషెత్తి నిలువలేక వెల్లడయ్యేప్పుడేనేమో
కవిత్వం గురించి ప్రతి ఝామూ పలవరించడం అంటే –
కవులకి గండపెండేర సత్కారమే కదా!
ఎంతగా కవిత్వం హృదయాంతర్మథిస్తుందో కానీ
ఎలుగెత్తి పదాల విన్యాసాన్ని
వేగంగా ఆర్పే కన్రెప్పల మీదుగా
ధ్వని హెచ్చుతగ్గుల కనుగుణంగా ఎగరేసే నుదుటి త్రోవ గుండా
తిన్నగా మనసు ఆనకట్టునించి ఎదుటి కర్ణికలకు
నదీపాయలుగా కర్ణాకర్ణం గావించడ మంటే
దట్టపు మనో మేఘాల నించి మనుష్యుల ఎండిన కాలాల లోన్కి
ధారాపాతంగా





కవిత్వాన్ని అనుక్షణం ఖడ్గచాలనం చేయించడమంటే
కవిత్వాన్ని సదా మాటలాడినంత సులభంగా అనుభూతించడ మంటే
అనుభూతించినంత సౌఖ్యంగా పదే పదే బిగ్గరగా చవులూరించడమంటే
నిజంగా విన్న ఏ కవి హృదయమైనా ఎప్పటికైనా ఎడారి అవుతుంది?
ఆగిపోయే వయస్సులోనైనా కలం ఆగకుండా లిఖించడం మానుతుందా?

*(అముద్రితం)*

# కూరల బతుకు

షీటు క్రింద మనిషో, మనిషి మీద షీటో
కుంభవృష్టి అయినా ముణగదీసుకుని అరుస్తూంటుంది
ముసలి ప్రాణం పొట్టనింపుకొందుకు
పది రూకల కోసం పొద్దస్తమానం కూర్చొనుంటుంది
చిన్న బుట్టెడు కూరలు పెద్ద బతుకుని వెళ్ళదీస్తాయి
పొద్దు పొడవక ముందు నించీ
చుక్కలు పొడిచే వరకూ
"చౌక" భ్రాంతిని కలగజేయడాన్కి
"ఆరణా" – "ఆగ్వా"లని గొంతు చించుకుంటుంది
చర్మం అతుకున్న ఎముకల డొక్కలోన్కి
రోజల్లా పోయేది ఒకే ఒక్క గరం చాయ్ మాత్రమే
మొద్దుబారి ముక్కలు పోయిన తూకపు రాళ్ళలా
ముడుతలు పడి గుంతలుపడిన కళ్ళు
ఆత్రంగా బతుకు ఎగుడు దిగుడులని తూకం వేసుకుంటాంటాయి
మాటి మాటికీ పైకం తడుముకునే
పైసల చిక్కం అనుక్షణం గుచ్చుకునే ఆకలిని మోగిస్తుంది
నవ్వక పోయినా నొత్తలు పడిపోయిన చెంపలు
చావు కంటే భారమైన జీవనాన్ని మింగలేక నెమరువేస్తాయి
పళ్ళులేక పోయినా కళ్ళున్నందుకు
ఓపికలేకున్నా బతికున్నందుకు





బతకాలని లేకున్నా ఆకలితో చావలేనందుకు
పాపం మూడు కాళ్ళనీ ముడుచుకుని
నాల్గు రకాల కూరల్ని ముందు పేర్చుకుని
వెన్ను వణికించే వానలోనూ
శవాల్ని సైతం గడ గడ లాడించే చలీ లోనూ
పావు బతుకుని పాయికింత చొప్పున తూచి అమ్ముతూంటుంది
ప్రపంచాలు మారినా మారని తలరాతతో
నిరంతరం శ్రమించి శ్రమించి
వణికే తలతో
వదులై పోయిన చర్మాన్ని కూడగట్టుకుని
గూటికి చేరే ముందు గిజగిజలాడే గువ్వలా
పొద్దస్తమానపు ఆక్రోశాన్ని
పచ్చి బూతుల మధ్య గొణిగి గొణిగి
"తుపుక్కున" కాలం "కారాని" ఉమ్మి
ఖాళీ బతుకు బుట్టని నెత్తిన బోర్లించుకుంటుంది
రాత్రయిన మనుగడని మరచి కొద్ది గంటలైనా
నిర్భయంగా విశ్రమిస్తుందో, లేదో గానీ
మళ్ళీ తెల్లారే సరికి చొరబడే వెలుతుర్లా
కూరల బతుకేసుకుని ప్రత్యక్షమవుతుంది

*"ప్రజాశక్తి"*
*23-01-2001*

# లేడీస్ స్కాలర్స్ హాస్టల్

జీవితంలో ఇంకేమీ మిగలనప్పుడే రీసెర్చి చెయ్యాలనట్లు
ఇక్కడి స్త్రీలు కోల్పోయిన ఆనందపు ముఖాల్తో తిరుగాడుతుంటారు
ఒంటరిగా తమని దాటెళ్ళి పోయిన కాలపు ప్రతినిధుల్లా
అసంతృప్తి హృదయాల్తో ఎవరికి వాళ్ళే తమలో తాము సంతృప్తిని
వెతుక్కొంటారు

ప్రొద్దుట్నించి సాయంత్రం దాకా
నేరేడు పళ్ళ చెట్ల క్రింద కొందరు
టీవీ పళ్ళని ఇకిలించుకుంటూ కొందరు
టెర్రస్ పైకెక్కి బాహ్య ప్రపంచాన్ని వీక్షించుకుంటూ కొందరు
మేట్రిన్ లనీ, అయాల్ని గడగడ లాడిస్తూ కొందరు
పుస్తకాల్లో దూరి గదుల్లో గంభీరంగా నడుస్తూ కొందరు
బేగ్ భుజానేసుకుని ప్రపంచాన్ని చుదుతూ కొందరు
రోజుల్ని నెడుతూ సంవత్సరాల తరబడి
స్కాలర్స్‌గానే మిగులుతూ వుంటారు
ఆహ్లాదపు ఉదయ సాయంత్రాలు బాధించినపుడల్లా
పోట్లాటకు దిగి గొంతుల ఘర్షణలో ఆత్మల్ని అణచుకుంటారు
రోజెప్పుడే ప్రారంభమై అంతమవుతుందో -
కాలంతో సంబంధం లేదిక్కడ
తెల్లారుఝాము దాకా ఏదో ఓ మూల గుంపులుగా చేరి
తెల్లారే సరికి మళ్ళీ గుంపులుగానే దర్శనమిస్తారు
శిథిలమైపోతున్న గోడలు.





పెళ్ళలు ఊడిన గచ్చులు
పిల్లుల వాసనేసే డైనింగ్ హాలు.
నల్లని సత్తు కేరియర్ల సత్తువలేని భోజనం
కాళ్ళ కడ్డంపడే అడ్డదిడ్డమైన గడ్డి మొక్కలూ
ఇక్కడి అమ్మాయిల్లానే ప్రపంచం పట్టకుండా వుంటాయి
గైడ్ల నియంత్రణల్ని
గైడ్ల భార్యల వద్ద బానిసత్వాల్ని
ప్రొద్దస్తమానపు లైబ్రరీ ఖరాబు పేజీల్ని
హడావిడిగా తిరగెయ్యాల్సిన బరువైన గ్రంథాల్ని
విరిగిన గేటవతలే వదిలేసి మెట్లెక్కుతారు
పరిశోధించాల్సిందేమిటో తెలీని వత్సరాల్ని లెక్కేసుకుంటూ
శోధించి శోధించి విసుగెత్తిపోయిన జీవితాల్తో విరిగిపోతూ వున్నా
వుండుండి గరగరమనే ఫోన్‌కాల్స్ కోసమూ
సాయంత్రపు సానుభూతి జల్లులు విసిరే మేల్ విజిటర్స్ కోసమూ
ఆత్రంగా ఓ కన్ను వాచ్‌మేన్‌కేసి వేసుంచుతారు
ఎవరి రాజ్యం వాళ్ళు సాధికారంగా ఏళ్ళతరబడి ఏలుకోవచ్చిక్కడ
ఏమీలేకున్నా అన్నీ వున్నట్లు భ్రమపడి బ్రతకొచ్చిక్కడ
నలిగిన జీవితమంతా అయిపోయాక వెనక్కి తిరిగి చూసుకుంటే
నలగని ఓ పరిశోధనా గ్రంథం
జ్ఞాపకాలు చెదరని హాస్టల్‌లా గంభీరంగా మిగుల్తుందిక్కడ

"సాహిత్యవేదిక" ఆంధ్రజ్యోతి డైలీ
*29-03-1999*

# లేడీ వార్డెన్

తల్లీ, తండ్రీ సంరక్షణాయంత్రం కలిపిన పరాయీకరణల్లోంచి
మమకారం, ప్రేమ తీసేస్తే వస్తుందామె
లేడీ వార్డెనంటే హిడింబిలానో, శూర్పణఖలానో వుండాలి
అందరి లెక్క ప్రకారం నన్నో, సన్యాసినో ఖచ్చితంగా అయివుండాలి
అవును మరి
స్వకాలం, బంధుత్వం రెండూ లేవు ఆమెకి
స్వతంత్రాన్ని హరించే శక్తి ఆమె ఆస్తి
కనీసం చూపుల్నయినా ప్రసరింపజేయనివ్వని
ఉక్కుగోడ మరి పిల్లలకి
ఆదివారం ఉదయానే
నూనె పట్టించిన పిల్లిపిల్లల్లా మెరిసే పిల్లల పాలిట
వొళ్ళు విరిచేసే నలుగుపిండవుతుంది
ఎంతకీ వదలని పేలన్నిటికీ చకచక నరుక్కుపోమ్మని
ఆజ్ఞలిచ్చే సైన్యాధ్యక్షురాలవుతుంది
ఇడ్లీ ముసలమూ, ఉప్మాల వేదనా పడని పసిరాయుళ్ళ పట్ల
గొంతు మింగించే చేతి కర్ర అవుతుంది
రాత్రంతా దొంగ దీపాల్లో కథలు చదివిన రాకుమారిణుల్ని
పాపం తెల్లారగట్లే కలల బయట పరుగులెట్టిస్తుంది
ఓ పట్టాన పక్క దిగని ఉడుం నిద్రల్ని గొంతు చేతుల్తో తట్టిలేపుతుంది
పెద్ద పిల్లల ఈసడింపు చూపుల్నీ
చిన్న పిల్లల భయం వెనక విసుగుని కళ్ళచాటున దాచుకుని





ఒక్కోసారి ప్రేమించబోయితమాయించుకుని ఉరిమి చూస్తుంది
ఒంటరితనం ఎవ్వరికైనా మరణమే కదా!
అప్పుడప్పుడూ వొదలని జ్ఞాపకాలు గది కిటికీలోంచి పోగొౌతాయేమో
చీర చెంగున ఆవిడ తడిసిన కళ్ళు, నాసిక వ్రేళ్ళాడుతుంటాయి
గొంతు గరగరమంటూ అశ్రువుల్ని సంభాషిస్తుంది
అప్పుడనిపిస్తుంది వార్డెనంటే కాస్తవేదన కూడానన్న మాట!
పద్మవ్యూహంలాంటి వుద్యోగంలో
ఆయాల కొకలాగ
పిల్లల కొకలాగ
తోటివారి కోలాగ
యాజమాన్యాని కోలాగ
కన్పించే ఊసరవెల్లి తనమూ తప్పదు
ఛీత్కారాల్ని చనువుగా తప్పించుకోవాలి
పన్ల అసమగ్రతాన్ని సరైన సమయంలో సరిచేయాలి
అలసత్వం కాని ఆప్యాయతని మాత్రమే పంచిపెట్టాలి
పిల్లల్లోని మంచి గుణాల్ని ఎప్పటికప్పుడు పోగుచేసి పేరెంట్లకి
జాబితాలు పంపాలి
వ్యతిరేకతల్ని నొక్కి పెట్టగలిగీ
తనపై వ్యతిరేకతకి ఇట్టే ఎగిరిపోయే తురాయి పువ్వు జీవితం అది
డబ్బు వాసనేసే హాస్టళ్ళలో సిసలైన వాసనలేని ముళ్ళజెముడు బ్రతుకు అది

"సాహిత్యవేదిక" ఆంధ్రజ్యోతి డైలీ
*24-11-1997*

# మా ఊరొక్కసారి

ఎంతైనా మా ఊరికి నేనూ కన్నబిడ్డనే కదా!
కొంగ్రలావి చెట్టు చెంగుచాటునే ఈ చేతులు రెక్కలైంది
అన్నిదారుల పొడుగుతా చెమ్మచెమ్మ మట్టి వెంటే
అడుగులు సొంత కాళ్ళయ్యింది
బంగాళా పెంకుల యిల్లే బతుకు వెచ్చదనాన్ని మరిపించి చిచ్చికొట్టేది
తులసి కోటచుట్టూ నూరిన బొగ్గుపొడి
ఇంకా పళ్ళని తళతళ్ళాడిస్తూనే ఉంది
ఆ నూతి పళ్ళెం పసిరి బాదం కాయల చప్పుడుకి
ఇంకా ప్రతిధ్వనిస్తూనే వుంది
వేప్పళ్ళు కూడా రుచికర ఆహారమే
బుట్టలకెత్తలేనన్ని లేడీ కానకాంబరాలే ఆహార్యాలు
కుప్పయ్యగారి మందువా లోగిలి
ఎర్రప్పగారి చీపురుపుల్ల మంత్రం
చెరువు కాపరి గద్దింపూ
గతించీ గతించని గుర్తులక్కడ
చక్రం కిళ్ళీకొట్టు పైసాపైసా బిళ్ళలమ్మడం మానేసింది
అల్లి పళ్ళు అంతూ పొంతూ లేవు
ధాన్యం మర కాలకృత్యాలకైనా ఓపికలేక కాలంలో కల్సిపోయింది
గంతల ఎద్దులు తెలగపిండితో బాటూ నలిగిపోయాయి



ఎదురింటి అత్తయ్యగారు ఏ వాడనున్నారో!
సగం కూలిన శివాలయాన శివుడు ఎలా వుండగలుగుతున్నాడో!!
దొరగారి దివాణం మెట్లని ఎవరు ఎక్కనున్నారో!!!
నీల్ళ కావిడి వాడు ఇంకా పెద్ద గొంతుకతో
పాటల కావిడిని మోస్తూనే వున్నాడు
ఐస్‌ఫ్రూట్ల అబ్బాయి బతుకు కాలుని ఇంకా కుంటుతూనే వున్నాడు
పాత పుస్తకాల దుమ్ముకి గ్రంథాలయం ఇంకా దగ్గుతూనే వుంది
బజ్జీల బండి ఇంకా ఉప్పు కారాలు దట్టించి తిరుగుతూనే వుంది
అయినా ఇప్పుడు మా ఊరికి నేను పరాయి బిడ్డనే కదా!
వీథీ వీథి కీ కొత్తే కాదా!
ఊరిప్పుడు అమ్మ జళ్ళో చంద్రకాంతం కాదు
నాన్న పేకాట అరుగు కాదు
అన్నయ్య ఎత్తేసిన పాల చెంబు కాదు
మా ఊరిప్పుడు నేనే
నాగరికతని మర్చిపోయి నాగరికతన్నేర్చుకున్న నేనే

(అముద్రితం)

# మండు వేసవి ఫ్యామిలీ కోర్టు

ప్రపంచంలో ఎక్కడా లేని సమానత్వం ఈ కళ్ళల్లో, ఈ గొంతుల్లో ఉంటుంది
ఇక్కడి ఆడ, మగ విభాగాల్లో
విడి విడిగా వ్యతిరేక భావాలు కదలాడుతూ వుంటాయి
పెళ్లి నాటి సిగ్గులు నిసిగ్గులుగా మారతాయి
వీళ్ళొక జీవితపు రేఖకి ఎరో వైపునా నిలబడి
లాయర్ల తూటాలతో కోర్టు బల్లలకి గురి చేసి
ఘోరాతి ఘోరంగా సంవత్సరాల తరబడి నిశ్శబ్దంగా పోట్లాడుకుంటారు
ఇక్కడి సాయుధదళాలు పిటిషన్లూ, కౌంటర్లూ
రహస్యంగా ప్లీడర్ల జేబుల్లో డబ్బు కుక్కడాలూ
స్త్రీ లంతా–దుఃఖం దాగిన కన్రెప్పలతో
ప్రతిఘటించీ ప్రతిఘటించలేని సందిగ్ధావేశంతో
వణికే గొంతుతో
పిల్లల మమతాను బంధ సంకెళ్ళతో
చెట్ల క్రింద ఉరితీసిన శవాల్ని నిలబెట్టినట్లు
ఆధారం లేకుండా నిల్చుని వుంటారు
పురుషులంతా కోర్టులు, చట్టాలు, సంఘం, ప్రపంచం
తమ పుట్టిల్లే అన్నంత ధీమాగా
సిగరెట్లు ఊదుకుంటూ
భవిష్యత్ ప్రణాళికల దరహాసాల్తో



వుండుండి నటించాల్సిన బాధల రిహార్సల్స్‌తో తలలు
సవరించుకుంటూ వుంటారు

భగవంతుడా!
అణచివేత, మోసపోవడం, క్షమ, బాధ్యత, జైలు జీవితం,
కన్నీళ్ళు నిండిన పక్కటెముకని తీసి స్త్రీని తయారు చేసావెందుకు?
ఇక్కడ
జడ్జీలు కరిచినా
లాయర్లు ఉరిమినా
సాక్ష్యాలు వెక్కిరించినా
నోరుమూసుకుని వుండాలి
గంటల, రోజుల బండరాళ్ళు భారంగా మీది నించి దొర్లినా భరించాలి
ఇక్కడ క్షణికమైన ఆవేశపు నిర్ణయం కలకాలం విభేదంగా మారుతుంది
పొగరెక్కిన భర్తలూ, తలవంచలేని భార్యల మధ్య
పోకచెక్కల్లా పిల్లలు నుజ్జయిపోతున్న భవిష్యత్తు ముఖాల్తో దీనంగా తలలు వ్రేళ్ళాడేసుకుని వుంటారు
జీవితాంతం భరించాల్సిన వాడు భరణం కూడా సరిగ్గా ఇవ్వడు
అక్రమత్వం అంటూ అరిచేవాడు రోజూ క్రమం తప్పుతాడు
ఇంతవరకూ ఈ బద్ధ శత్రువులిద్దరూ ఒక కుటుంబంగా ఎలా
చెలామణి అయ్యారో!!
మానవత్వం లేని ఈ మర మనుష్యులకి
దిక్కుతోచని పిల్లలు గానీ
ముఖాన ఉమ్మేసి సమాజం గానీ లెక్కలోనికి రావు

ఇదంతా మామూలై పోయిన కోర్టు మనుషులు
కేసుల చదరంగంలో చిక్కుకున్నవారి
అవసరాల కష్టాన్ని, రెక్కల డబ్బుని పీల్చుతూంటారు
న్యాయం తెల్సిన వాల్ళు, తెలీని వాళ్ళు
అన్యాయం మీద వాలి గుంపుగా జీవిస్తుంటారు
ఆకాశం, భూమి మాత్రం
ఎంతకీ తెమలని కేసుల్ని,
కోర్టు వరండాల వెంబడి తిరిగే మూర్ఖుల్ని,
వ్యాపారం మాత్రమే బంధమైన మృగాల్ని సాధించాలని
మండు వేడి గాడ్పుని తీక్షణంగా విసుర్తూ వుంటాయి

*"ఈ వారం కవిత" ఆంధ్రజ్యోతి వీక్లీ*
*12-03-1999*





# మృత్యువేట

జీవితాన్ని త్వరత్వరగా తవ్వుకున్నచోటే పాతరైపోయింది
మట్టి రాయై, రాయి వజ్రమై
తనలోకి ఆకర్షించి, వికర్షించింది
బతుకు రహస్యాన్వేషణ కుటుంబాల్ని కుప్పకూల్చింది
వ్యాపారం - జనాల్ని ఎందుకూ కాకుండా పూడ్చిపెట్టింది
ఇప్పుడు ప్రశ్నిస్తున్నారు
ఏ రాక్షసధనం వాళ్ళని లోబర్చింది
బలవంతపు బ్రతుకు వేటా?
స్వలాభాలోచనా?
వాళ్ల స్వప్నాల్ని, వాళ్ల కలల భవిష్యత్తుని
గోరీల క్రింద నించి వెలిబుచ్చుకోవాలి
నలిగిపోయిన కాళ్ళతో ఇంక అగాధాల్లో బ్రతుకుని వెతుక్కోనవసరం లేదు
ముద్దయిన తలల నిండా
అత్యాశా కుహరాల్ని నిర్మించుకోనవసరం లేదు
బతుకుల్నెవరు భ్రష్టం చేసారు
కుతంత్రపు డబ్బేనా
డబ్బునెవరు కనిపెట్టేల్తున్నారు
దుర్మార్గపు లోకమేనా
విధి ఒంటి కాలు మీద నిల్చుంది వజ్రాల్ని మెరిపించుకుంటూ

ప్రమాదం రంగు రాళ్ళ నించి ఉరుకుతుందని వాళ్ళకేం తెల్సు ?
జీవన ప్రమాణాలెరుగని వట్టి ఆశాజనిత హృదయులు
ఎవరెట్లా మలిస్తే అలా మలిచిపోయే మట్టి మనుషులు
రూపాయిల కోసం తెగించని మరమనుషులున్నారా ఎక్కడైనా
ఉపయోగింపబడీ
ఉపయోగించుకునీ
హఠాత్తుగా భూమి పుత్రులు నేల రాలిపోయారు
మృత్యువుని వెంటాడీ, కుళ్ళబొడిచీ
మట్టిలో పెళ్ళలై విరిగి పోయారు
వాళ్ళకేం తెల్సు –
అజమాయిషీల గొంతెప్పుడూ ఏ వాతా పడదని
ప్రాణాల్ని పణంగా పెట్టినపుడు
హరించినా భరించాలని

*"ఈ వారం కవిత" ఆంధ్రజ్యోతి వీక్లీ*
*07-03-1994*





# నాన్న కావాలి

నాన్నా! ఒక్కసారి నిన్ను తల్చుకుని గర్వపడనివ్వు
మరణించే లోగా –
నిన్ను గుర్తుతెచ్చుకోబోతే
అమ్మ జుట్టుని బలంగా ఈడ్చుకెళ్ళిన నీ చేతులు కన్పిస్తాయి
నా వీపు మీద నీ పాదముద్ర పచ్చబొట్టులా చెరగకుంది
తెలియకుండానే అర్థించిన పసి అరచేతుల జతలు
బాల్యపు దుఃఖాన్ని అదిమి పెట్టాయి
నాన్నా! నాకొక్కసారి నిన్ను ఇష్టపడాలనుంది మరణించేలోగా
నువ్వు జ్ఞప్తికి రాబోతే
అర్థరాత్రి నిద్ర కళ్ళకి నీ తాగుబోతు ప్రేలాపనావాదాలు
స్వప్నంలోనూ జడిపిస్తాయి
రచ్చకెక్కి మరీ రబస చేసుకున్న నీ బ్రతుకు
నన్ను నిలువునా వణికిస్తుంది
చెంపదెబ్బలకి మొద్దుబారిపోయిన చెక్కిళ్ళు
అశ్రుధారల్ని గుండెకి సైతం స్పర్శతెలీకుండా చేసాయి
నీకై మనసారా వ్యథపడాలనుంది
ఏటెల్ల కాలమూ నీ మాటలు కొరడాలనుకున్నావు
ఎప్పుడూ నలుసుల్ని నొక్కి పెట్టిన చెప్పుతెగదనుకున్నావు
ఇప్పుడు నీ కాళ్ళకీ, చేతులకీ ఆసరా కావాల్సొచ్చింది

మనసుకి ఇప్పుడు మమతానురాగాలు ఆవశ్యకమయ్యాయి
పిల్లలంతా ఇప్పటికిప్పుడు పితృప్రేమాంకితులై పోవాలి
నానా! సహజంగా ప్రేమించాలనుంది నిన్ను మరణించేలోగా –
అన్నయ్యకి చెడ్డీలు మార్చి మురిపెంగా చూసేవు నిజమే
ఏడాదికొక్కసారి భోగి స్నానం
ముగ్గురికీ మనస్ఫూర్తిగానే చేయించావు
ఫైవ్‌స్టార్ చాక్లెట్టు ప్రేమ పూతతో చెల్లిని
బాగానే నీ పార్టీలో చేర్చుకున్నావు
నాన్నంటే –
పిల్లలకి జీవితాన్నివ్వాలని
నాన్నంటే –
అమ్మకి సరిక్రొత్త ఆభరణమనీ
నాన్నంటే –
ఒక భద్రతా నిర్వచనమనీ
నీకసలు తెలీనేలేదే!?!
నాన్నా! నువ్వు మరణించేలోగా
నిన్ను చూసి నేను గొప్పగా గర్వించాలనుంది
నానా! నేను మరణించేలోగా
నిన్ను దక్కించుకోవాలనుంది

*"ఆమె" ఆంధ్రభూమి డైలీ*
*20-07-1992*





# నగర పునః ప్రవేశం

నా జ్ఞాపకాల్నీ పాతేసుకుందీ నగరం
మంచు కళ్ళతో ఇసుక అడుగుల క్రింద
ఎప్పటిలాగే నన్ను స్వాగతించినా
ఇక్కడెవరూ లేరు – నాకై ఎవ్వరూ లేరు
నా తెలివితేటలకి కీర్తి కిరీటాలు అలంకరించి
నా తెలివి మాలినతనాన్కి నన్నే బలిచేసి
సగం విరిచి నన్ను విసిరేసిందీ నగరం
ఎక్కడికక్కడ మొలిచిన రంగు భవంతుల నడుమ
విశాలమైన రహదారుల వెంట
నా తెగిన జ్ఞాపకాల శైథిల్యాలు
బిక్కు బిక్కుమంటూ చెల్లాచెదురుగా కన్పిస్తాయి ఎప్పుడూ నాకు –
ఓ వర్షోదయం పూల చెట్టు క్రింద నవ్వులో
ఓ కెరటం వెన్నుల మాటున వెచ్చని కౌగిలో
ఓ దుఃఖాతిరేకపు వీడ్కోలో
మనసిని కెలికినట్లయి ఒళ్ళు జలదరింపజేస్తుంది ఎప్పుడూ
రెండు రకాలుగానూ మోసపోయి
ఇంకేమీ మిగలని ఏ క్షణంలో గుర్తు రాని నగరపు జాడలు
చూడగానే జ్ఞప్తి కొస్తాయెందుకో
ప్రపంచంలో
అణచివేత, దుఃఖం, దగా, బాధ, శతృత్వం, కసి

మర్చిపోదామనుకున్నా వెంటాడుతాయెందుకో
ప్రేమని మర్చిపోయినంత సులభంగా
కక్షని మర్చిపోలకుండా చేసిందీ నగరం
అందుకేనేమోనే రాగానే
ఈ గాలంతా మంచు కళ్ళని దించుకుని
చెట్ల చేతుల్ని వినయంగా ముడుచుకుని
ఆఫీసుల తలల్ని విధేయంగా మూసివేసి
క్షంతవ్యంగా నిల్చుని వుంది
వెతకాల్సినవేమీ లేవని తెల్సిన
ధీమా అడుగుల్తో నేను ప్రవేశిస్తూన్నపుడు
నిరాశ పడాల్సిందేమీ లేదన్నట్లు
హృదయాన్ని విశాలం చేసి
ఎప్పటిలా పలకరించిందీ నగరం
కానీ ఎంత కాదనుకున్నా
తరచి తరచి ఆలోచించకూడదనుకున్నా
అంతటా ధూళి రేణువుల్లో ఎర్రరక్త కణాల్లా
నా జ్ఞాపకాల అశ్రువులు అతుక్కుని ఉన్నాయేమో
ఇంకా మనసంతా నగరంలోనికి రాగానే
బుగులు బుగులుగా గతం బురద లోన్కి దిగబడింది

*ఆదివారం ఆంధ్రజ్యోతి*
*14-03-1999*





# నెలలు నిండేదాకా

నెల నెలా నా శరీరాన్ని భాగ భాగంగా
పంచుకుని రూపుదిద్దుకుంటావు నువ్వు
నోటి ద్వారా గెడ్డని మింగానట్లు మొదలై
నన్ను వికారపు ప్రపంచం వెంట కుదిపి కుదిపి
తమాషాగా లోపల్లోపలే ఉదర కుడ్యాల మీద
మెత్తని బాక్సింగ్ చేస్తూ
ఉండుండీ నీటి గుర్రంలా గింగిరాలు కొడ్తూ
నిండు నిండుగా నా ఒళ్ళంతా భారమై
నా ప్రపంచంలోకి సుదీర్ఘంగా అడుగు పెడ్తావు నువ్వు
నిన్నా మొన్నటి నాశైశవాన్ని తుడిచి
నువ్వు శిశుత్వాన్ని అందుకుంటావు
నా చిన్నారి పాపాయీ !
నా కళ్ళల్లోకి మెత్తటి నవ్వు విసిరి
అమాయకంగా రెప్పలు విప్పుతావు నువ్వు
పుట్టిందే మొదలు నా పేరు నేర్చేసుకుని
మాటి మాటికీ నన్ను మాతృత్వపు క్షీరామృతంలో ముంచుతావు నువ్వు
నా చూపుడు వేళ్ళందుకుని కొత్త వ్యాయామాలు మొదలెడతావు
వంగలేని తనాన్నీ, మోకాటి నెప్పుల్నీ,
వివరించలేని నిస్సత్తువనీ
భవిష్యదానందనం కోసం భరిస్తున్నా –
వెలుతురు ఫోబియా నించి

తట్టుకోలేని వాసనల నించి
సహించని జీర్ణాశయపు వెనుక తోపునించి
నిన్నందుకోవడం కోసం ధైర్యాన్ని తెచ్చుకుంటున్నా -
ప్రాణాలన్నీ ఒక్క ప్రాణి కోసమే తపించి పోతాయి
కొత్త బంధాన్ని గుండె గదుల్నిండా ఉక్కిరిబిక్కిరిగా నింపుకుంటుంది
మాటి మాటికీ ఒకో స్వప్నం
మస్తిష్కానికి మధుర ఊహల్ని నేర్పుతుంది
ఆకలేస్తే చాలు పొట్టలొంచి తట్టితట్టి అల్సిపోతావు
బాధపడితే ప్రశ్నార్థకంగా ముద్దయి ముడుచుకుపోతావు భయంతో
శరీరాన్ని భాషగా మార్చుకుని
శాయశక్తులా నిశబ్ద సంభాషణలు చేస్తావు
నా చిట్టి పాపాయీ!
భయంగా లేదూ ??
ఒంటరిగా గదిలో బంధించినట్లు
అంధకారంగా - ఊపిరి సలపనట్టుగా లేదూ ?!
ఏ అవస్థలోంచి నీ స్వరమూ సిద్ధమౌతూందో తెలీదు కదూ!
ఒక సుషుప్తి నుంచి ఎప్పటికి మేలొంటావో ఆలోచించవు కదూ!
నిన్ను సురక్షితంగా మోసి, చేతుల్లోకి తెచ్చుకోవడమే నా ధ్యేయం
నీ నిమిష నిమిషాన్ని ఆప్యాయంగా జ్ఞప్తి చేసుకోవడమే నా లక్ష్యం
నీ కాలంలో గతాన్ని, మంచి వర్తమానాన్నీ,
భవిష్యత్తులో సిద్ధపడడమే ఇప్పుడంతా నాకు -
సు మధుర ఊహాలోకంలో గ్రీష్మాన్ని సంతసంగా
తలవంచడమే ఇప్పుడంతా నాకు -

*"దీపావళి ప్రత్యేక సంచిక" ఆంధ్రజ్యోతి 1993*





# నీరెండ స్నానం

పీఠభూమికి సబ్బునురగ అంటించినట్లుంటుంది చలి ఉదయం
మంచు గడ్డ మీద పైకి ఎండ సోకినా లోపల కరగనట్టే
నీరెండ చర్మాన్ని మాత్రమే నునువెచ్చగా చేస్తుంది
లోపలి కండరాల కణాల్ని వేరే తీసి ఆరబెట్టుకోవలసిందే
గంటలు గంటలు ఎండలో మునిగితేలినా
పాదాలరచేతులు చలిలో ముంచితీసినట్టే వుంటాయి ఎప్పటికీ
ప్రపంచపు సౌందర్యమంతా డిసెంబరం పువ్వులాగా
శీతాకాలంలోనే దాక్కుని వుండినా
చలికి తట్టుకోలేనితనం
ముళ్ళనూ గులాగా ఒళ్ళంతా అంటుకుంటుంది
చిత్రంగా - ఎండకి కాగిన శరీరం
నీడ కొంగు పడగానే గప్పున దీపం ఆరిపోయినట్లు చల్లారిపోతుంది
సముద్రం లోంచి ఎంతకీ బైటికి రావాలని అనిపించనట్లే
తొలి ముద్దు ఆహ్లాదపు అనుభూతి లోంచి మనసెన్నడూ తేరుకోలేనట్లే
గుండెని చల్లగా కోసేసే మంచు కత్తి మొనమీద
నీరెండ స్నానం -
ముఖం మీంచి వెచ్చవెచ్చగా
మెత్తటి ఎండ స్పర్శ దేహమంతా చుంబిస్తుంది
పగిలిన పెదాల నుంచి గొంతులోన్కి దిగి
గడ్డకట్టిన రక్తాన్ని చరచరా పాకిస్తుంది

అభి ముఖంగా వుండినంతసేపూ నునువేడిమి పూతలేని
వెను తిరగగానే పొరలు పొరలుగా విప్పేసుకుంటుంది
రాత్రంతా గొడుగు మడతల్లా ముడుచుకున్న వొంటిని
నెమలి విప్పుకున్నట్లు ఎండలో ఆరబెట్టుకోవాలనిపిస్తుంది
గది తూర్పు ద్వారం నించి వాలుతెరలా జాలువారే
నీరెండ మనసెంత మృదువైనదోగానీ
సందేహం లేకుండా నన్ను నేస్తాన్ని చేసుకుని ఒళ్ళో సేదతీరుస్తుంది
దేహమంతా అమ్మలా తడిమి కాళ్ళమీద పడుకోబెట్టుకుని
నెలల పిల్లకి లాల పోసినట్లు స్నానం చేయిస్తుంది

*(అముద్రితం)*



# ఒక్క మనసు చాలదు

ఇసుక తిన్నెల్ని తీసుకొచ్చి
పీఠభూమిపై  ఎవరు బోర్లించారో గానీ
వానలే లేని కరడు గట్టిన నేలలో
అక్కడక్కడా పచ్చదనాన్ని ఎవరు చిలకరించారో గానీ
ఆకాశానికీ, భూమికీ మధ్య ఇంత విశాలమైన
కవాటాల్లేని పరిచిన హృదయం
మానవత్వం, అమానవత్వం సగం సగం పంచుకుంటున్న
ఈ కాస్త నేల సర్వం
వొద్దన్నా కంటికింపు వరాలనిస్తోంది
అక్కడక్కడా ఎగిరే గాలిపటాలు మంచు పర్వతాల్లా కూలీనట్లు
మారుమూలల్లో మిణుగురు పురుగులు కదిలినట్లు
కన్పించి మాయమయ్యే గడ్డి మనుష్యులు
తమ దూరంతనంతో
ఆకాశం చివర వ్రేళ్ళాడే
సముద్రం లాంటి లేత నీలి చిరు కనుమలు
అమ్మ స్తన్యాన్ని పాలు అయిపోయినా
ఆటకు పీకే పసిపిల్లల్లా
రాని పచ్చి మొక్కల్ని మళ్ళీ మళ్ళీ పెరికే బర్రెలు
కువరని వర్షం తాలూకు శీతల పవనాలతో
ఊగిసలాడే కొయ్యబొమ్మల్లా ఎత్తులేని వృక్షాలు

ఎవరు శ్రమించి చిత్రించారో గానీ
ఋతువుల ఉలితో కష్టించి శిలల్ని మల్చి ప్రతిష్టించారో గానీ
రాతి చివర రాయి నిల్చొని వుంటాయి
ఎవరు శిరస్సు వంచి మోకరిల్లారో గానీ
మళ్ళీ మళ్ళీ తిన్నెల్ని తీసుకొచ్చి పీఠభూమిపై బోర్లించారో గానీ
విశాలత్వాన్ని మనసుకి నింపుకోవడాన్కి ఒక్క మనసు చాలదు
నక్షత్రాలు రాలిపడే అనుభూతి విస్తీర్ణం పదాలలో వొదగదు

*ఆదివారం వార్త*
*23-12-1999*





# పారం

ఎప్పుడూ ప్రపంచం వేరు, స్వప్నం వేరు
బ్రతుకు వేరు, జీవితం వేరు
కొత్తగా మెలకెత్తి చిగురించే సమయంలో
మనమేదో రాతల్ని పునర్లిఖించగల మనుకుంటాం
రాత్రి దుప్పట్ల నిండా ఊహల్ని పగటికి తర్జుమా చేసేసుకుంటాం
పచ్చని ఆహ్లాదాన్ని మెళ్ళో వేసుకుని
లోకం మన కోసమే జన్మించిందన సంబరపడిపోతాం
హఠాత్తుగా ఒక నిజం తెలుస్తుంది
కొమ్మ విరిగి నెత్తిన పడ్డట్లు
భూమితో పాటూ గుండ్రంగా తిరగడం ప్రారంభిస్తుంది కాలం
నిలబడ్డ చోటి నుంచే తిరిగి చుగురించాల్సొస్తుంది
ఆగిపోయిన ఉష్ణవాహిని ఎలాగోలా నడిపించాల్సొస్తుంది
భూమ్యాకాశాల మీద చచ్చే వరకూ ఏ చేయీ కన్పడదు
ఎటు చూసినా కనుచూపుమేర సముద్రమో, ఎడారో అగుపడ్తుంది
భయపడని వాటెన్నిటికో భయ పడాల్సొస్తుంది
మింగుడు పడనివెన్నో జీర్ణించుకోవాల్సొస్తుంది
వాస్తవం తెలిసీ కలల వెంట పరుగులెత్తాల్సి వస్తుంది
పోగుపడిపోయిన కాలాన్ని సాఫీ చేసుకుని సాగాల్సొస్తుంది
ఎప్పుడూ నేను వేరు, మనం వేరు
స్త్రీలు వేరు, పురుషులు వేరు

*(అముద్రితం)*

# పనికొచ్చే పథకం

ఆడపిల్లనగానే నాకు గుర్తుకొచ్చేది
తెల్లారగట్ల లేచి అమ్మ వెనకాల పేడకళ్ళాపి చిమ్ముతూనో
పొగపొయ్యిని కళ్ళల్లోని ప్రాణాలు తెచ్చుకుని ఊదుతూనో
అమ్మలు అందరూ ఆడపిల్లలకే ట్రైనింగిస్తారెందుకో
నాన్నని, అన్నల్ని, తమ్ముళ్ళని సుఖనిద్రపోనిచ్చి
వాళ్ళ తిండికి, చదువుకి, వ్యక్తిత్వాన్కి, సౌఖ్యానికి
అమ్మాయిల్ని ఖాళీ ప్లేట్ల వెనక,
ఊడ్చిన గదుల వెనక,
ముగ్గు సొగసు ముసుగు వెనక పాతిపెడ్తారెందుకో?!
తప్పని బాధా వంటింటి ముళ్ళ కిరీటాన్ని
అలవాటు చేసేందుకేమో –
వాషింగ్ మెషిన్ల తర్వాత పని
గ్రైండర్ల ముందు, వెనక పని
చివరికి టీ.వీ. చూస్తున్నంతసేపు నోరాడాల్సినపుడూ
ఆడపిల్లలకే ప్రాధాన్యత పాపం
ఆడపిల్లనగానే – కళ్ళ నీళ్ళే జ్ఞాపకం వస్తాయి నాకు
ఉప్పునీళ్ళని గుడ్లని కుక్కుకుంటూ
పెగలకూడని గింతువెనక
గుంభనంగా దాచుకోవలసిన కోర్కెల వెనక
ఆశల వెనక, అణగద్రొక్కబడే ఆకాంక్షల వెనక

90



ఆశయం లేని జీవనం వెనక
వొంటింటికి ఏళ్ళ తరబడి వ్రేళ్ళాడే బూజుల్లా –
తీసేసినా మళ్ళీ మళ్ళీ అదే స్థానానికి అతుక్కుంటూ అగుపిస్తారు నాకు
వంటింటిని కంప్యూటరీకరణ ఎందుకు చేయరో మరి!
ఆకలీ సగం జాతికి మాత్రమే కాదు కదా!
విశ్వాంతరాళంలోకి ఓ మహిళ
రైలింజను నడుపుతూ ఓ మహిళ
దేశాల్నేలుతూ కొందరు
ఓసారైనా వొంటింట్లోకి
అడుగుపెట్టకుండా వుంటేనే నిజమైన లక్ష్యసిద్ధి
ముందంతా విస్తృత ప్రపంచం
ఇంటికొచ్చే సరికి నక్కలా కాచుకున్న వంటగది
అంతరించి పోతున్న లభీముల్ని
హోటల్ మేనేజ్‌మెంటుకి పరిమితం చేయకుండా
కిచెన్ మేనేజ్‌మెంటు నేర్పించండి
లక్షల కోట్లలో వారినీ వృద్ధి చేయండి
దేశం అభివృద్ధి చెందడమంటే
పరిశ్రమలు, అక్షరాస్యులు, ఉద్యోగులు మాత్రమే కాదు
అంతర్లీనమైన చాకిరీని పంచడం కూడా
ఇదసలు బానిసత్వమే కానట్టు
వెట్టి చాకిరీ అస్సలు తామెన్నడూ చూడనట్టు

91

వెట్టి చాకిరీ అస్సలు తామెన్నడూ చూడనట్టు
వంటింటి అవతల నిలబడి
తినేసి పోయే వారందరి "సా"భిప్రాయం
త్వరగా వంట కాదేమోనన్న గాభరా ఉదయాలు
ఎంతకీ తెమలని వడ్డింపుల మధ్యాహ్నాలు
నిద్ర సుఖమెరుగని రాత్రిళ్ళు
మార్చే వాళ్ళే లేరు ఎందుకో –
మా పేర్న అభివృద్ధి పథకాల డ్రామాల్లో
నిజంగా కొన్నాళ్ళు "మగాళ్ళు – వంటిళ్ళు" పథకం ప్రారంభించరెందుకో!?
సంస్కృతి – పరిరక్షణ
స్త్రీలతో ప్రారంభమై
స్త్రీల వద్దే పెంపొందింపబడి
స్త్రీలనే అణిచివేస్తాయి
ఆడపిల్లనగానే
అట్ల పెనమో, అంట్లగిన్నో జ్ఞాపకం వచ్చే
సంస్కృతిని అరికట్టండి ముందు
సాధ్యమైతే విముక్తి మార్గాన్ని
హైటెక్కున వివరించండి ముందు

*(అముద్రితం)*





# పరపరాగ విరాగం

ఎన్నాళ్ళీలా అవయవాల్ని కడుపులోకి కూడగట్టు కోవటం?
దారం లేని గాలి పటాల్ని ఎన్నాళ్ళని కాపాడుకోవటం?
శరీరం ఒక పోరాటం
మనసు మరో యుద్ధం
రంగుల ప్రపంచంలో అక్షర రాహిత్యమై మిగిలి, మిగిలి – ఎంతకని ఇలా?
గుండెకీ, లోకానికీ రాని జబ్బేం వుంటుంది –?
వ్యర్థ ఊపిరిని అసంబద్ధ చక్రం చుట్టూ పీల్చొదలటంలో ప్రయోజనం ఏవుంది?
జీవిత కాలుష్యాన్ని మోహానికి చెడపూసుకోవటం తప్పు –
పొరలు పొరలుగా బతుకు బురదని రోజుకొన్ని పూతలేసుకోవడం తప్పు –
రాగ మాధుర్యాలకి
రక్షానుబంధాలకి దూరంగా విసిరి వెయ్యబడ్డాక –
కర్పూరం కన్నీటి మేఘం మీంచి భారాల్ని దించుకుంటారు
ఎందరో బాల్యపు చాంచల్యాన్ని తిరిగి అందుకుంటారు
అన్ని అలసటలకీ ఒక్కటే విరామం
కేంద్ర స్థానాన్కి సంతృప్తి ఒక్కటే లక్ష్యం
జగమంతా రెండ్రెండు జీవుల మధ్య తిరిగి పెద్దదవ్వొచ్చు
జంటలు జంటలై నూరేళ్ళు బట్ట కట్టి పోనీ –
శాఖలు ఉపశాఖలై అడవులై విర్రవీగనీ –
ఇదొక్క దుర్భర నైజవూ వొదిలి పోదేం?!

అవివాహ సత్తాకి, వివాహ అతృప్తికి
వెలిగిన, వెలగని జీవితాలకి
ఆపుకోలేని క్రూర పురుషత్వాన్కి
ఇదే నా గోదా??
ఈ ఒక్క రాక్షస వాంఛా రూపు మాసి పోదేం?!
యుద్ధం
మతం
కాలం లాంటి పునర్ముద్ర ఈ ప్రాణుల నొదిలి పోదేం?!!
ఖండ విస్తృతాలకి బద్ధులై ఎంతకెన్నాళ్ళిలా?!
ఈ ఒక్క అవయవాన్నీ విసిరవతల పారేస్తే చాలు
మరో సృష్టి ఇంకాగి పోతే చాలు

"నీలిమేఘాలు" సంకలనం



# పసి యంత్రాలు

నీ అరచేతులు నావేళ్ళంత పొడవైనాలేవు
నీ కాళ్ళు గాడిదల కాళ్ళంత బలమైనా లేవు
అయినా మేం నీ చేత కప్పులు తీయిస్తాం
పళ్ళాల ఎంగిలి నీ కడుపుకి పెడ్తాం
మా వేడి టీ గ్లాసంత ఎత్తయినా లేవునువ్వు
నువ్వు బాలుడివన్న దృష్టి మాకు మా పిల్లల్ని చూసైనా తట్టదు
తట్టినా ఒప్పుకునేందుకు తలవంపులు మాకు
అమ్మ దగ్గర పాలు తాగినన్నాళ్ళే నువ్వు చిన్నారివేమో
పసివాడి తనమే నీ పసి తనమేమో
నీ జీవితం హోటలు బల్లపై తుండు గుడ్డగానో
పేద కళ్ళని నింపుకున్న తట్టలానో
డబ్బుకి పుట్టిన పిల్లల సంరక్షణాయంత్రం గానో స్థిరపడుతుంది
ముక్కు పచ్చలారని నీ కాలం
బస్సుల్నీ, రైళ్ళని శుభ్రం చేసి చేయి చాస్తూనో
మెకానిక్ షెడ్లలో రోజు రోజుకీ మసిబారి పోతూనో
పాలీష్ బూట్ల క్రింద పడ్తూ లేస్తూనో
సంవత్సరాలు పూర్తి చేసుకుంటుంది
మా పిల్లల కోసం మే చాక్లెట్ల, బిస్కెట్ల,
ఐస్ క్రీముల అందమైన బాల్యాల్ని తయారు చేస్తాం
మేమంతా చదువుకుని,
మేమే బాల సంక్షేమ సంఘాలయ్యా

సమావేశలయ్యీ
ఏడాది కొకసారి ఇవేళ్టి నీ భవిష్యత్ కోసమే
మాట్లాడు కుంటున్నామని సమర్థించుకుంటాం
మొక్కల్ని పెంచి భూమి పచ్చగా వుండాలని కోరుకుంటాం
ఇప్పుడిప్పుడే నాటుకుంటున్న మీరు
ఎండారో, వానారో
బతికేరో, చచ్చేరో
అసలు మీరు ఏ ప్రపంచం అడుగున
కష్టం రెక్కల్లో జీవితాన్ని విర్చుకుంటున్నారో ఆలోచించం
మా కళ్ళెదురుగానే లోకం చాకిరీ అంతా చేయించి
ఇవేళ్టి బాలలే భావి పౌరులంటాం
సంఘంలో మీరూ భాగస్వాములని కూడ బలుక్కుని
మా రహస్య నోళ్ళు మేమే మూసుకుంటాం
ఎవడి భవిష్యత్తు వాడే చూస్కోవాలంటాం
చదువు కంటే, ప్రగతి కంటే, ఆకలి ప్రధానమైన చోట
మేమే అమ్మానాన్నల మయ్యీ
నీ పొట్ట నీ చేతికే ఇస్తాం
అందుకే నువ్వు పాలు తాగడం మానగానే శ్రామికుడి వయ్యావు
అందుకే బాలుడా! నువ్వు "బాల్యం" అంటూ ఒకటుందని
తిరిగి చూస్కున్నపుడు మాత్రమే అర్థమయ్యే స్థితి కొచ్చేవు

*ఆంధ్రజ్యోతి వీక్లీ*
*22-02-1999*





# ప్రయోగం మూలం

జీవిత సార్థక్యం, పుణ్య పురుష లభ్యత్వం లాంటి
వృథా కాలపు మాటలెందుకు?
కాకపోతే క్రిందా మీదలుండవు
పలపరింతల సెగల పొగలుండవు
అన్నీ ఊహాత్మకాలూ అన్ని పన్లూచేస్తాయి
అప్పుడూ ఇప్పుడూ
జంటగా ఒంటిగా ఒక్కేలా శరీరం సంకోచించి వ్యాకోచిస్తుంది
రబ్బరుని సాగదీసి గోడకేసి మేకులు కొట్టినట్లు
శరీరమంతా విస్తృతమై మంచానికి అతుక్కుంటుంది
హస్తాలు ఎంత పనైనా చేస్తాయి కదా!
మనః శరీరాల్ని చల్లార్చే దివ్య చికిత్స సాధానలౌతాయి
అప్పటికప్పుడు పుంసత్వాన్ని పొందే పది రూపాయల కొవ్వొత్తి
మహత్తర కార్యాన్ని క్షణాల్లో ముగిస్తుంది
ఇంత మాత్రానికి వేలకి వేలు పెట్టి వేళ్ళు ముడి పెట్టడాలూ –
లక్షలకి లక్షలు పోసి లబో దిబో మనడాలూ –
అవసరమే ఇవేళ్టి వేలానికి అర్థమైన చోట
చౌకగా సుఖాన్ని కొనుక్కోవడం సులభం కదా!
కాకపోతే అమ్మలు కావడాలూ, అమ్మమ్మలు కావడాలూ వుండవు
పవిత్రంగా మంగళ సూత్రాలు కళ్ళకద్దుకోవడాలూ వుండవు

నిద్రొచ్చేదాకా ఎవరి కాళ్ళూ పట్టనక్కరలేదు
భర్త బ్రాండు లాగూలూ, బనీన్లూ ఉతికి ఆరేయనవసరం లేదు
కష్టించి తయారు చేసిన కూరలకి పేర్లు పేట్టే వాళ్ళుండరు
అరచూ కోవడాలూ, వెళ్ళగ్రక్కలేక దుఃఖం దిగమ్రింగుకోవడాలూ
ఏదీ – నచ్చనిదేదీ వుండదు
పగళ్ళెళ్ళి రాత్రుళ్ళు, రాత్రుళ్ళెళ్ళి పగళ్ళు ఆనందంగా వచ్చి పోతుంటాయి
పురుషుడంటే సమానత్వ చిహ్నమైన చోట
పురుషుడంటే మోహానికి ముందూ తర్వాతా ఒక్కటే అయిన చోట
పురుషుడంటే నిజమైన నాన్న అయిన చోట
ఇదే పురుషత్వం అని ఋజువైనపుడు
కృత్రిమాలు సహజాలవుతాయి
"ఓస్"లు "ఓహ్"లవుతాయి

*"ఆహ్వానం" సెప్టెంబరు 1997*





# ప్రేమలిపి

నిద్రతో తీరని ప్రేమైక రాత్రి
గువ్వలా వొదిగి హృదయాన్నంటి పెట్టుకుని నిద్రపోతూంది
చీకటి తలుపు చాటున దాక్కున్న
స్పర్శామైత్రి జీవితాన్కి అందమైన తలపుల్ని పంచుతుంది
ప్రేమకి మాత్రమే సాధ్యమైన
ఈ జగత్సౌందర్యం అనుభూతించడానికీ అదృష్టముండాలి
కలల పవనాలు మెలకువలోనే సాధ్యం –
రాత్రి అద్భుతం రాత్రికే ఎరుక
విశ్వాంతరాళంలో ముద్దాడుకుంటున్న ఈ రెండు హృదయాలని
మించిన ఆనందం వుందా!?!
అంతలోనే బాల్యం, యౌవ్వనం ఉక్కుమ్మడిగా జైత్రయాత్ర చేస్తాయి
మురిపాల రాత్రిని తాగి, స్నానించి అమృతమౌతాయి
స్వప్నాలకి అసూయ రేకెత్తించే వాస్తవం
ఇంక ఎక్కడైనా వుందా?!?
జీవితాన్ని సౌందర్యవంతం చేసే శక్తి
ఇంకే చోటైనా దాగుందా!?!
ప్రేమించే గుండెల్లో తప్ప ఇంకే భాషలోనైనా
అనుభూతిని వర్ణించే లిపి వుందా –

*(అముద్రితం)*

# ప్రేమతుప్పు

వాళ్ళు ప్రశ్నిస్తారు
నీకూ అతనికీ ఏంటి సంబంధం అని?
ఎక్కడికెళ్ళినా, ఎప్పుడైనా
నేను అవ్యక్తానందం, జీవితాలంబనలాంటి
స్వప్నంలోని కబుర్లన్నీ ఒంపి
వాళ్ళ ముందు జవాబుదారీగా నిలబడతాను
ఎప్పుడూ భవిష్యత్తు ప్రేమమయమే అవుతుందని విశ్వసిస్తాను
నిరంతరం ఎగిసే ప్రేమ జ్ఞాపకాల వల్ల
ధైర్యంగా – ప్రశ్నించినవారందరికీ –
మనసారా ఆనందిస్తూ మరీ
చెప్తాను – అతణ్ణి నేను ప్రేమిస్తున్నానని
రోజూ నన్ను అపరిమితంగా ప్రేమిస్తున్నానని ప్రమాణాల్చేసే
అతణ్ణీ వాళ్ళు అడుగుతారు
ఆమెకీ, నీకూ ఏంటి సంబంధమని?
నింగీ, నేలా నా నెత్తిమీద కూలి
దివ్యమైన నా స్వప్నాలు దిక్కుమాలినవై రోదించేలా
అతడు సమాధానం చెప్తాడు –
ఆమెవరో నాకు తెలీదని

*"భూమిక" జనవరి 1999*



# ప్రైవేట్లు "ప్రైవేట్లు"

తెల్లారగట్ల చలిచెవుల్ని పుస్తకాల్లో దాచుకుని
పనిగట్టుకుని లోకాన్నుద్ధరించాలని వెళ్ళేవాళ్ళం
మేష్టారికైనా టీ నీళ్ళు దక్కేవేమో, మాకదీలేదు
నిద్ర మంచాల్ని దాటుకుని
ఒకరింటి వాకిలి దగ్గర మరొకరు అల్లారాలై
లెక్కలింగ్లీష్సైన్సుల్ని పనిపాపల్ని చేసుకెళ్ళేవాళ్ళం
దొంగ చన్నీళ్ళ స్నానంతో తీరని సగం కునికిపాటూ
మిత్ర బృందం కళ్ళబడుతూనే చప్పునెగిరిపోయేది
పుస్తకాల్లోది తప్ప అన్నీ మాట్లాడుకునే వాళ్ళం
అప్పుడే కాని ఇంజనీర్లమీ, కాని డాక్టర్లమీ
మేమే అవుతామని మాకేం తెల్సు?!
పదో క్లాసు వెలగబెడ్తున్నందుకు
బెత్తానికి జడిసేది లేదని దార్లోనే తీర్మానించుకునే వాళ్ళం
ప్రైవేటు మహాయజ్ఞంలో నచ్చేదొక్కటే –
నిడుపాటి రెండు మైళ్ళ నడక
కొట్టుకుంటూ, తిట్టుకుంటూ
నవ్వుకుంటూ, తుళ్ళుకుంటూ
మిడతల దండులా వాలే వాళ్ళం చివరికి పుస్తకాల మీద
మేష్టారి పిల్లల్నెత్తుకు ఆడించే ఆయాలమై కాస్సేపు

రకరకాల మొక్కల్ని పెంచే తోటమాలులమై కొంచం సేపు
పరకాయి ప్రవేశం చేయడమూ విద్యలోని భాగమే
కంఠాన్నించి తలకాయని వేరే చేసి
ఏదో గడగడా కంఠతా పట్టేసే వాళ్ళం
మాకేం తెల్సూ?!
కాని ఇండస్ట్రీయలిస్టులూ, కాని ఐ.ఏ.ఎస్. లూ మేమే అవుతామని –
ఎరుపెక్కిన అరచేతుల దుఃకఆన్ని
పుస్తకాల సంచీలకి పూసుకుంటూ
ఆసక్తిలేని చదువుని "హమ్మయ్య" అయ్యిందనిపించి
సెలవుదినాల్లోనూ తప్పించుకొందుకు వీలుపడక
స్వరాజ్యం తెచ్చినంతా కష్టపడి పోయేవాళ్ళం
సూర్యుణ్ణెక్కడైనా గుచ్చుకోనిచ్చే వాళ్ళమా?!?
వలనెత్తుకెగిరిపోయిన పావురాల్లా
బయటపడే వాళ్ళం
బంధింపబడిన కాళ్ళని పరీక్షహాల్లో వదిలేసి
కొత్తకాళ్ళేసుకుని చక్కా వచ్చేసే వాళ్ళం
మాకేం తెల్సూ!?!
ఇపుడు బొటాబొటీ పబ్లిక్ రిలేషన్సూ, పాలిటిక్సూ డిగ్రీలమూ
ఎంతకీ గట్టెక్కని ఇంటర్ మీడియట్‌లమూ
ఆగని ప్రపంచాన ఆగిపోయిన టెన్త్‌లమీ మేమే అవుతామని!!

*ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక 1992*





# పుడమిశాపం

ఎక్కడైనా అమ్మకు కోపం వస్తే ప్రాణం తీస్తుందా!?!
కానీ ఈ కసాయి భూ మమ్మకి కించిత్ కరుణ లేదు
అవిగవిగో తుత్తునియల స్వప్నాలు
బతుకు మీద పగిలిన భూమి  జాడలు
శిథిలాలు నమిలేసి ఊసిన అవయవాలు
దర్జాల బతుకులన్నీ కల్లలని తేలిపోయిందిగా
డబ్బు విలయం ముందెందుకూ కొరగాదని అర్థమైందిగా
కడుపు నొప్పొస్తే కదలక పడుకోవాలిగానీ
పేగులు పైకి తన్నేట్లు ప్రకంపిస్తారా ఎవరైనా!!
ఉండచుట్టుకు పోయిన బండరాళ్ళ పడమితల్లికి గుండె లేదు
ఇళ్ళే సమాధులైన విగతజీవులారా రోదనలాపండి
బతుకు దుర్గంధం కంటే ఇదే మంచిదనేమో
పాపాల, అసత్యాల, వెగటు వేషాల సగటు జీవనం కంటే చావే నయమేమో
ఎంతైనా మంచి చెడులెంచాల్సిన అమ్మ కదా
అందుకే పొట్టన బెట్టుకుంది
ఎందరెందరో చేసే తప్పులకి
పాపం ఎవరెవరికో శిక్ష పడింది
అవుగో మూతబడ్డ ఊళ్ళ నోళ్ళు
బద్దలైన గుండెల రహదారులు

పాతిపెట్టబడ్డ బడి పిల్లల నవ్వులు
ఎవరేం చేసారమ్మా ఈ బంగారు బుడుతలు
తన కన్నబిడ్డలపై తానే ఎక్కి కరాళ నృత్యం చేస్తారా ఎవరైనా?
అమ్మ సింహాసనంలా మందహాసాన్ని తెగనమ్మింది
ముందూవెనకా ఆలోచించకుండా చావుని ప్రపంచీకరించి
బతుకుని ప్రకంపాలతో చిత్తు చేసింది

*(అముద్రితం)*





# పునరపి జననం

ప్రపంచం ఎలా విస్తరించిపోతోంది నిజంగా?!
హఠాత్తుగా ఒక్కొన్ని కండరాలు చుట్టబెట్టుకుని
ఆగి ఆగి కడుపంతా నొప్పి సంకోచించీ వ్యాకోచించి పోతుంది
వ్యవధి తగ్గుకుంటూ వచ్చి శరీరాన్ని
పళ్ళబిగువున గజగజ లాడిస్తుంది
పొట్టకి కేజీల రాయిని వ్రేలాడదీసినట్లు
క్రిందికి సాగిన బొజ్జలోపల్నించి బాధ క్షణ క్షణానికి నాడుల్ని మెలిపెడుతుంది
"అమ్మా" అన్న మాట తప్ప మరేదీ రాదు
వెయ్యి విస్ఫోటనాలు ఒక్కసారీ వొణికిస్తాయి
కన్నీళ్ళు కూడా అక్కడక్కడే విసురుగా వొణుకుతాయి
అనాచ్ఛాదిత కాళ్ళని మడిచి కట్టేసి –
గుప్పెళ్ళని ఇనుప గుంజల తాళ్ళని బిగించి –
ప్రత్యక్ష నరకాన్ని బల్లమీద వెల్లకిలా అనుభవించాల్సొస్తుంది
క్షణాలు యుగాలై పోతాయి
"ఓం సాయిరాం" డాక్టరూ,
"హే అల్లా" నర్సూ,
"ఏసయ్యాల" ఆయాలు
బల్లచుట్టూ గుమిగూడి ఎంత గింతు చించుకున్నా సరే –
నొప్పి గిలగిల్లాడించినపుడల్లా

కన్రెప్పలు గట్టిగా ముడిచి
దవడ కండరాలు పళ్ళు విరిగి పోయేలా బిగించి
శ్వాస, నోరు మూసుకుని
ఉన్న ఊపిరితోనే క్రిందిక విసర్జనక్కూర్చునట్టు ముక్కడమంటే –
వెన్ను పైకెత్తకుండా
గొంతు పైకి రానీయకుండా
సెలైన్ల నరాలు తెగిపోయేలా మాటి మాటికీ ఒళ్ళు బిగించుకుపోవడమంటే–
ప్రాణం పోతున్న వ్యధ అనుభవానికొస్తుంది
గంట గంటకీ
పెద్ద ప్రాణం పోదు, చిన్న ప్రాణం రాదు
కాళ్లెయ్యికండరాలు గుంజేస్తాయి
ఊపిరి రాన్రానూ విసిగి పోతుంది
ఒక్కటే ఇచ్ఛ –
ఒక్కసారి కాళ్ళని బారచాపు కోనివ్వండి ప్లీజ్
కనీసం నన్నయినా బ్రతకనివ్వండి బాబోయ్ –
పొట్టకోసెయ్యండి దయచేసి –
ఉండుండీ తుంటి ఎముకలు విరిగిపోతూ యెడం అయిపోతున్న వేదన
"ఉండ"లా కాళ్ళ మధ్య స్పర్శ కొచ్చేంతవరకు –
బాధకి విముక్తి ఏంటో అర్థం కాదు
ఎలా అక్కణ్ణించి బతికి బట్టకట్టాలో తెలీదు



ఆ రెండు ద్వారాల్నించి ఏమేం బయటికొస్తున్నాయో
నిస్సిగ్గుతనాన్కి అస్సలర్థం కావు
సున్నితస్థలాల సూదులు గుచ్చుతున్నా
చర్మాన్ని ఇష్టం వచ్చినట్లు కోనేస్తున్నా
ఆక్సిజన్, వేక్యూం, ఫోర్‌సెప్స్ మాటలు విన్పిస్తున్నా పట్టదు
ఫెటేలున ఆనకట్ట నించి నీరు ఎగదన్నినట్టు
తటాలున నిశ్శబ్ద తూటా దూసుకొచ్చినట్టు
కన్రెప్పపాటున హఠాత్తుగా
మొత్తం శిశువు విసిరేసినట్టు వచ్చేంతవరకు మూల్గాల్సిందే
గదినెగరగొట్టేసే ఏడ్పుతో
తను జన్మించి, మళ్ళీ జన్మని అనుభవానికిచ్చి
బాధని అతివేగంగా మరిపించేసి
మళ్ళీ బల్లనెక్కేంత వరకు –

*ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక 1994*

# రాజమండ్రి సాయంత్రం

రాజమండ్రి సాయంత్రం బూడిద రంగు ఆకాశం లోంచి
వాడకొక జల్లెడనించి బురద పూరిత మౌతుంది
నిండిన కడుపుకి, నిండని కడుపుకి పట్టాలు చోటిస్తాయి
చలినించి వేడికి, వేడి నించి చలికీ
రాజమండ్రి ఎగ్జిబిషన్ మేరీ కొలంబస్ ఊగుతూ వుంటుంది
స్టేడియం పిల్ల కాళ్ళ క్రింద
క్రికెట్ బంతి దిగబడుతుంది
ఆగని రైతు దక్షిణ మధ్య నించి – దక్షిణ తూర్పువరకు
వస్తూ వెడుతూ వరద గోదావరిని చీల్చుతుంది
రణగొణల రోడ్లు దాటితే
బొగడచెట్టు బోధివృక్షంలా గౌతమీ గ్రంధాలయానికి ఆహ్వానిస్తుంది
రేవు వెంటా తిరగని పడవలు
తిరిగే జీవితాల పొట్టలు కొడతాయి
టీనీళ్ళ సాయంత్రాల నించి
చికెన్ సూప్‌ల సాయంత్రాల వరకు
రకరకాలుగా విడదీయబడతాయి
నీళ్ళ బిందెలు మోసే కాళ్ళు అరిగిన చిహ్నాలు
సబ్బు బుడగల వాళ్ళతేలే ఊపిరి
నానాటికీ చీకటైపోతున్న ప్లాట్ ఫారం సంచారపు బతుకులు
మెరక వీధి మరకలు



రాజమండ్రికి సుగంధాన్నిచ్చే దుర్గంధాలు
రాజమండ్రి సాయంత్రం
పేపరు మిల్లులోంచి బిలబిల మంటూ హడావిడిగానో
జంక్షన్లలోపిడత క్రింద పప్పులా కారం కారం గానో
అడితీ కర్రల అదరు వాసనతోనో
సరిక్రొత్త కాలనీల నిశ్శబ్దం లోనో
తలమునకలై ముసుగుతన్న బోతూంటుంది
వెలుగు చీకట్ల కతీతమై మేరువులా నిల్చున్న మూడో బ్రిడ్జి
ఆగకుండా మోగే ఆలయాల ఘంటా నాదం
కాలాన్ని గంభీరంగా గమనించే గోదావరి మాత
అజరామరమై రాజమండ్రిని వెలిగిస్తాయి
నియాన్ లైట్ల నించి
నడి వీధుల్లోంచి
రాజమండ్రి వర్ష సాయంత్రం
చీకటి చీకటిగా
చమ్మెచెమ్మగా ఇళ్ళల్లోకి ప్రవేశిస్తుంది
గుండెల్లోకి చేరి గొంతుక్కడ్డం పడ్తుంది

*ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక 1996*

# శీతాకాల జ్ఞాపకం

ముడుచుకున్న కొలదీ ఇరుకుల్లోంచి వెన్నెగ్రబ్రాకుతుంది శీతలం
రాత్రంతా-పగటి అవాస్తవాల్ని వాస్తవీకరించుకున్న స్వప్నాలన్నీ
మస్తిష్కం లోంచి అమాంతం బయటికొచ్చి శరీర మ్మీద పర్చుకుంటాయి
పగలెక్కడో ఓ చోట పారేసుకున్న కళ్ళవెంట
చిర్నవ్వుల గురుతుల వెనక
శరీరం వణికిన ప్రతిసారీ
తిరిగి ప్రసారితమౌతుంది
స్మృతుల మూలసెక్కడో వొదిగిన వెచ్చని జ్ఞాపకం
చీకటి నిండా విప్పారి
గదిలోకి ఉష్ణవాయువుల్ని విరజిమ్ముతుంది
ప్రత్యేకించి మనవై మిగిలే సాయంత్రం ఆలోచనలన్నీ
దుప్పటీలోనెగళ్ళై చలి మంటేసుకుంటాయి
డిసెంబర్ నెల యవ్వనాన్ని పరీక్షించేందుకే వచ్చినట్టు
వెంటిలేటర్లలోంచి మంచు చూపులేసుకుని క్రీగంట చూస్తూంటుంది
చేతివేళ్ళని చేతుల క్రింద దాచుకుని
భుజాల వేడిమిని తడుముకుంటూ వున్నా
చలిదాచుకోలేని నాసిక
శీతగాలిని శ్వాసించలేక అష్టకష్టాలూ పడ్తుంది
వెల్తురులోని గమ్మత్తైన సంజ్ఞలన్నీ





రాత్రి చుంబనాలై మాటిమాటికీ మేల్కొలుపుతూంటాయి
మంచ మ్మీద ఏక పాత్రాభినయం చేయవలసిన క్షణాలన్నీ
మళ్ళీ మళ్ళీ గతం ఛాయల వెంటే పరుగులు తీస్తాయి
రణరంగంలో వీరవిహారం చేసీ చేసీ అంతో ఇంతో వెచ్చనై
శీతలాన్ని తరమేసానని సంబరపడిపోతాయి
ఆదమరిచి నిద్రించాల్సిన చలి రాత్రులన్నీ
ప్రపంచాన్ని ఒంటరి ముక్కలు చేసి క్రూరంగా నవ్వుకుంటాయి
ఎంతకీ తెమలని చీకటి
నల్ల కంబళీలు వరుసగా విసురుతూనే వున్నా
తీరని నిద్ర కళ్లు గంభీరంగా తెల్లవారిన జాడల్లో
పగలల్లా తిరిగి తిరిగి
మళ్ళీ రాత్రికి ఒక్కొన్ని జ్ఞాపకాల్ని ప్రోగుచేసుకుంటాయి

ఆదివారం ఆంధ్రజ్యోతి
*13-12-1996*

# ఉత్పాతం

నిజానికీ కాస్త కార్యంలోనూ ఏవుందని ?
ప్రపంచం ఈ కేంద్రకాన్నే అంటిపెట్టుకుని
తనదైన కక్ష్యల్లో తిరుగుతుంది
బతికుండగానే, ఒంటి మీద స్పృహ వుండగానే
సమాధిలోన్కి
నిష్క్రమించలేని జీవైక్యానందంలోకి జారిపోవాలి
శరీరాన్కి మనసూ, మనసుకి శరీరమూ
బంధింపబడీ, చిక్కుబడీ
కంపనాలకి, లయలకి మధ్య జీవితాన్కి సలాము కొట్టాలి
ఆ ఒక్క క్షణంలోనే సార్థకమైపోయే
నిశ్శబ్దపు బతుకుని వెతుక్కోవడం ఎంత కష్ట సులభం?!
ఊపిరినించి ఊపిరి
అవయవం నుంచి అవయవం తిన్నని వారధి
కదల్లేని, స్వరం రాని పదాల యుగ్మానికి బానిసలై
ఒక్కటే కాంక్ష
ఈ సెకన్లకి వ్యవధి వద్దు
జీవితాన్కి మరే ఇతరమూ వద్దు
క్షణాల పూలని హత్తుకునీ, తిరగబడీ
ఏమి బాధరా భగవంతుడా!
ముక్తికి ఇదే మార్గమా?!





రగిలించేసే శక్తియుత వేదనాభరిత పూర్ణావేశం –
పెదాలు స్పృశించలేని, ఉనికి లేని ప్రాంతమేది?
జీవం అంతు కనుక్కోవాలన్న అన్వేషణకి అంతం ఏది?
తపన బానసల్ని చేసి కంటినించి వేలి దాకా ఉష్ణవాయువుల్ని విరజిమ్ముతుంది
ఈ ఒక్క వ్యధా తీరితే చాలు
ఈ కాస్త క్షణాల్లో లోకం తలక్రిందులై పోదులే
ఏముంది ఈ కాస్త భేదంలో?
స్త్రీ, పురుష – పురష, స్త్రీ
ఒక్కటే యుద్ధం ఆది నించి అంతం వరకూ
అరేసి నిమిషాల్లో తటాలున తేలిపోయే సమరం
ఆధిక్యత, అనాధిక్యత అన్నీ అణిగిపోతాయి
నిన్నూ, నన్నూ అవసరం అన్ని రూపాలా
ప్రేమించీ, కామించీ, మోహించీ వదుల్తుంది
దహించీ, ద్రవింపజేసీ మనసుని శాంత పరుస్తుంది
నాకూ, నీకూ ఉన్న ప్రసరణ సాధనం శరీరమే
ఆప్యాయతకీ, అవసరానికీ అన్నిటికీ ఈ ఇహమే కదా
ఏముంది చివరికి?
ఏమి మిగలని చల్లబడ్డ కట్టులు తప్ప –
నిన్నూ, నన్నూ ముంచేసే ప్రవాహం తప్ప –

"ఆహ్వానం"
జూన్ *–1996*

# వర్షోదయం

చెట్లు నీళ్ళాడుతాయి

పక్షులు గలగలా ఎగిరినట్లు

బిందువులు రెక్కలు విప్పుకుని నేలవాలుతాయి

ఆకాశం దుఃఖం అయిపోయి

వెల్లకిలా చేతులు వ్రేళ్ళాడేసింది

మేఘం ముఖం ముడుచుకుని

వర్షం మెడలో దాక్కుంది

నా జ్ఞాపకాల్తో చెదిరిన ముత్యాలు పైట మాటున తపిస్తున్నాయి

వర్షపుదారి వెంబడి

నీ పాదాలు దొరుకుతాయోమెనని

తడుస్తూ నా మనసు

ఆత్రంగా వెతుకుతోంది

చెట్లనీ, పుట్లనీ

ఆకాశాన్నీ, మేఘాన్నీ

*(అముద్రితం)*





# వెంటాడే స్పర్శ

దేహానికి ఇంత మహాత్మ్యం వుందా?!

స్పృశిస్తే – చర్మాన్ని చీల్చి గుండెని గాల్లో పక్షి ఈకని చేసి ఎగరేసిన అనుభూతి

పెదవుల నించి రక్తనాళాల్లోనికి,

నాడుల నుంచి కణాల్లోనికి

మాటి మాటికీ జ్ఞాపకాల చుంబనాల స్పర్శ

చలికి తావుందా?!

అనుభూమతికి అంతం వుందా!?

శరీరమంతా తడిముద్రలేసి

హస్తాల విన్యాసంతో మనో కాంక్షని స్వాధీనం చేసుకుని

ఎప్పటికీ తెప్పరిల్లనివ్వని అనుభవ సారాంశం –

మాటలాడ గల్గుతుందా?!

ఇంకేదైనా ఆలోచించగల్గుతుందా?!

ఒకే ఒక్కటి

క్షణాల జ్వలనం

రగిలే ఉచ్ఛ్వాస నిశ్వాసాల నడుమ

పొడిలి తడబడే ఆరాటాల మధ్య

ఒకే ఒక్కటే మిగిలింది పరిష్కారం –

అక్కడ భూత భవిష్యత్ వర్తమానాలుండవు

లేని పలువలతో బాటూ విలువలుండవు

నిలువునా పాతేసినా శరీరం చల్లబడే వరకూ ఊపిరాగదు
చుట్టూ మంటలేసినసనా మొదలే కాలే ఆ పాద మస్తకం తగలబడదు
అనుభవం అరక్షణంలో కందరాలు మర్చిపోతాయి
మళ్ళీ మళ్ళీ గుర్తుకొచ్చే అనుభూతి
నిమిష నిమిషానికీ దేహాన్ని చుట్టుముట్టి
బాధని సెకనుకి రెట్టింపు పెంచి
తెగని ఆలోచన్ల జలప్రవేశం చేయిస్తుంది
స్పర్శా రాహిత్యాన్ని తట్టుకోలేని కాలం
జ్వలించీ ఆరని వాంఛ
అశ్రువుల్లో మనసుని ఓడిపోయి శరీరాన్ని గెలుస్తుంది
ఎదురు చూడకుడదని తెలిసీ
తగదని అర్థమయ్యీ
సెగలు పొగలై
ద్వారం వద్ద నిరీక్షించే అభిసారికలా
జ్ఞాపకాల చివర వచ్చే జన్మ కోసం వేచి చూస్తూ వుంటుంది

*(అముద్రితం)*



# బూచి

అతణ్ణి నిందించి ఏం లాభం?!
కుర్చీకెక్కించాక –
బతుకే నరకమైపోయిన తర్వాత
నిద్రలేచే సరికి రూపాయి దిగజారి పోతున్నపుడు
ఇప్పుడు గొంతు చించుకుని ఏం ప్రయోజనం?!
కత్తుల్నీ కుత్తుకల్లోకి దించిన తర్వాత
షాకు మీద షాకిచ్చి స్పృహ పోగొట్టాక
నిప్పులేకుండానే భగ్గున మండే కనీసావసరాలతో మళ్ళీ వెనక్కి పోవాల్సిందే
బియ్యాన్ని పట్టుకుంటే ఆకలి గప్పున లేస్తుంది
బస్సెక్కితే టిక్కెట్టు పేదరికం మీద కసిగా చక్రాల్ని పోనిస్తుంది
గుడ్డి దీపం వెలిగించినా పన్ను పోటొచ్చేలా పన్ను నెత్తిమీదకి ఉరుకుతురింది
వాళ్ళని నిందించి ఏం లాభం??
ఓటు చాటునే వంచనా సర్పం వేయి నాల్కలా కాటేసి వదిలాక –
ఇక్కడ అరిస్తే బూటు కాళ్ళు
నోరెత్తితే లాఠీలు
తిరగబడితే లాకప్పులు సమాదానం చెపుతాయి
ఇప్పుడు భయపెట్టడానికి రాకాసి పిశాచాలవసరం లేదు
కరెంటు బూచి చాలు
కాలిపోతున్న వర్తమానం మీద వణికించే ధరల సూచి చాలు

బరువుల్ని నెత్తిన రుద్దడమడమే ప్రజాస్వామ్యమైన చోట
ఎవర్ని నిందించి ఏం ప్రయోజనం –
సామాన్య భవిష్యత్ సున్నా అయిన చోట
జనమంటే నవ్వులాట అయిపోయిన చోట
వాస్తవంలో బతకలేక ఎండి ఛస్తున్న చోట
ఇక్కడ చావడాన్కి రోగాలే రానవసరం లేదు
వార్తలు వింటే చాలు గుండె పోటు అదే వస్తుంది
వైర్లు ముట్టకుండానే కరెంటు షాక్కొట్టి ప్రాణం తీస్తుంది
ఎముకలతో ఈడ్చూ జీవనాన్ని బూడిద చేసి వదుల్తుంది
తన్నే కాలు మానవునిదే ఐతే
నోరు మూయించే వాడు నిజంగా మేధావియైతే
నిప్పుల్లోకెందుకు తోస్తాడు ఒక్కపెట్టున రాజ్యాన్నంతటినీ
ఎవడు లోకువైతే వాణ్ణి కోయడమే వారి ప్రవృత్తి
ఇప్పుడు తలలు బాదుకుని ప్రయోజనం లేదు
తలలతోనే ఢీకొని నేలరాలినా ఫర్వాలేదు
అరాచకం విరిగేంతవరకు
ఎవ్వర్నీ నిందించి ప్రయోజనం లేదు
అందర్నీ నిలదీయాల్సిందే

*"గ్లోబల్ ఖడ్గం" సంకలనం 2001*





# జలపాతం ముంగిట

మనసులో దాచుకోలేని అభిజ్ఞత కళ్ళల్లోంచి పోటెత్తుతూన్నా
రెప్పల ఇనుపతెరల్ని బలవంతంగా దించేయగల కర్కశుడివి నువ్వు
మాటలాడాలి వున్నదేదో – కానీ కానిదేదో మాటలాడి
చెప్పాల్సిందే విధంగానూ చెప్పని మాటల మాంత్రికుడివి నువ్వు
కళ్ళ క్రింద నల్ల చారల్ని చూసినపుడల్లా
కలల అన్వేషణలో దారితప్పి అగాధంలో పడిపోయిన
స్వాప్నికుణ్ణి చూసినట్లుంటుంది
కాంతవంతమైన చిరునవ్వు
బయట ప్రపంచంలోన్కి రాకముందే మాయమైపోయి
మేఘం ముసిరీ కురవని వర్షంలాగా
చక్కని కల హఠాత్తుగా చెదిరినట్లుంటుంది
స్ఫూరద్రూపం కన్పిస్తేచాలు
ఇక రాదనుకున్న రైలు రెక్కలు కట్టుకుని వాలిన అనుభూతి
ఆ వెంటనే ఆలోచన్లు కిటికీ గుండా
ప్రక్క పట్టాలతో పరుగెత్తి పరుగెత్తి అల్సిపోతాయి
దూరం నించి గంభీరమైన స్వరధ్వని అలలాగా తాకగానే
సత్యమూ, జీవమూ, మార్గమూ చూపించే
ఏకైక ప్రవచనం అణువణువునా ప్రవేశించి ఆత్మావలోకనం చేస్తుంది
ఏళ్ళతరబడి మనసు ముంగిళ్ళలో పెంచుకున్న మౌనపుపూదోట

పూలతీగల్ని కలల చుట్టూ అల్లుకున్న అల్లిబిల్లి కాలం –
వాస్తవాల కవుకు దెబ్బల్తో గాయపడ్డదేహం –
నిజాల నించి నిర్మలత్వాన్ని తోడుకుని సంతృప్తి పడ్డ జీవనం –
జలపాతం ఎదురైతే ఏం చేస్తాయి?!?!
మౌనం గభాలున దూకి ఆత్మహత్య చేసుకుంటుంది
కాలం చిన్నపిల్లగా మారి ధారలకు అరచేతులడ్డి కేరింతలు కొడ్తుంది
దేహం వ్రేళ్ళూని చిగురులు తొడిగి, పుష్పించి, శాఖలు వేస్తుంది
జీవనం – ఇప్పటిలా కలల వెన్నెల నురుగుని పూసుకుని
కళ్ళు మూసుకుని నిలుచుని తన్మయత్వాన్ని తనివితీరా అనుభవిస్తుంది

*(అముద్రితం)*





# ఒక ఒంటరితనం

ఒంటరితనం ఎప్పుడూ ఒంట్లో బాలేనప్పుడే గుర్తుకొస్తుంది
సహాయం అవసరమైనపుడే అసహాయులమని అర్థం అవుతుంది
చిన్నప్పుడంతా టీచర్లు విరగ కొట్టినపుడో
గుడ్డలిప్పించి అమ్మ వీధిలో నిలబెట్టినపుడో
అన్నయ్యా, చెల్లీ ఉక్కుమ్మడిగా మౌనం వహించినప్పుడో
అడ్డయీ కాకుండా మింగలేకుండా వుండేది
నిజంగా ఏకాకి కాని వయసంతా
చుక్కల్ని చూసుకుంటూ దిగులు గానో
మరోటో మరోటో గెడ్డం కింద చెయ్యేసుకుని
గోళ్ళకేసి చూసుకుంటూ గడిచిపోయింది
ఇరవయ్యారేళ్ళ వయస్సులో సూత్రాల్ని అమంగళంగా తెంచుకున్నప్పుడు
ధైర్యంగా కొడుకునెత్తుకుని విశాల ప్రపంచం తలుపుల్ని
ఎడం చేత్తోతెంచుకుని బయటపడినప్పుడు
సునాయాసంగా ఎమ్మేల్ని తాకట్టుపెట్టి
జీతం రాళ్ళని భుక్తాయాసంగా తడుముకుంటున్నప్పుడు
ఏడ్చే స్థితి దాటి ప్రతీ దానికీ నవ్వే స్థాయికి
విరహం నించి వైరాగ్యానికి చేరుకున్న దశలోనూ
ఎప్పుడూ రాని ఒంటరి తలంపు జ్వరం వచ్చినప్పుడే వస్తుందెందుకో
తీరిగ్గా తరుక్కుని తరుక్కుని ఎవ్వరూ లేరని వ్యథ పడ్తుందెందుకో

*ఆదివారం ఆంధ్రజ్యోతి*
*02-11-1997*

# ఒక స్వాప్నిక దర్శనం

నిద్ర ఎంత గొప్ప సౌందర్యావస్థో కదా!
నువ్వు కోరుకున్న ఒంటరి దుప్పటీ నీ గాంభీర్య చిహ్నంలా
ముడుచుకునీ ఉచ్ఛ్వాస నిశ్వాసాల్తో ధైర్యంగా కదుల్తోంది
నీ ప్రక్కనెవరూ లేక
బాధ్యత లేని చేతులు హాయిని ఆపాదించుకుని
స్వప్నాల్ని ముడివేసుకుంటున్న పదహారేళ్ళలా వున్నాయి
చిందర వందరగా రేగిన జుట్టు పాయలు
రోజల్లా అసహనాల్తో అలసిన కనైప్పలపై
నెమలి పింఛామరల్లా ఆగి ఆగి స్పృశిస్తున్నాయి
గాఢంగా అర్థం అవుతుంది
ఏకాంతం ఎంత గొప్ప వ్యవస్థో కదా!
లోకమంతా ఇందుకే – ఓర్వలేకే – నీ ఒంటరితనాన్ని భంగపర్చాలని చూస్తుంది
సంతోష దుఃఖాల్ని వ్యష్టేసమిష్టిగా పంచుకోవడాన్ని అసూయతో చూస్తుంది
ఇంకెటూ తోచక వ్యక్తిత్వాన్కి ఒక్కాస్త బురదరాసి
నీ శరీరాన్కి అనర్హత ముద్రవేసి
జంట ముళ్ళ చక్రం లోన్కి సాధ్యమైనంత వరకు లాగడాన్కి చూస్తుంది
అసాధరణ జీవితాన్నెన్నుకున్న నీ తెగువని చూసి
కసిగా వెన్నుపోటు మాటలు విసుర్తుంది
ఒంటరి నిద్ర ఎంత మనోహరమైందో కదా!





అడుగున్నర స్థలంలో
విశాలమైన ప్రపంచాన్ని మూడంకె వేసి దర్శించే
అద్భుత స్వాప్నికుడివి నువ్వు
విశ్వం సర్వాన్నీ ఒక్క నిద్ర చేసి లేచి
సంతృప్తిగా ఏల గల గొప్ప మనో బలశాలివి నువ్వు

"సాహిత్యవేదిక" ఆంధ్రజ్యోతి డైలీ
*02-03-1998*

# పెరటి ఆకు

నా హృదయం దుమ్ముపట్టిన పెరటి మామిడాకై గుమ్మానికి ఊగుతోంది
వానాకాలం వస్తేనే గానీ ఈ పూలన్నీ మళ్ళీ మొక్కలు కావు
ఏనాటి నించో అలవాటైన ఈ గాలి
పొరపాటుగా నా ముక్కును తాకుతుందేమోనన్న గగుర్పాటు నాకు
పసిజాడలీ బురదలోనే దాగున్నా
ఈ తీగలే నా ఆత్మ స్తంభం చుట్టూ అల్లుకున్నా
ఈ పశు దుర్గంధ పచ్చని వాకిళ్ళ ప్రాణవాయువునే
నేనింకా శ్వాసిస్తానేమోనన్న స్వాతిశయం నాకు
ఈ పెరటి మందారాన్నై
చిక్కుడు నూగునై
ములగ చెట్టునై
పూయని అగ్నిపూల మానుపై ఇక్కడే నేను యౌవనించినా
ఈ జ్ఞాపకాలే నన్నెప్పటికప్పుడు పునర్జీవింపజేసినా
పల్లెటూరి మడ్డుతనం నా ఒంటికి ఇంకా వదలదేమోనన్న మహా
భయం నాకు
ఈ పంచభూతాలు నాకు జన్మనిచ్చినా
నా పాతికేళ్ళ విత్తనాల, పూల, పళ్ళ వేళ్ళన్నీ
ఈ మారుమూలే నాటుకుని వున్నా
నా మెట్రోపాలిటన్ మనసెందుకో





ఈ వాతావరణాన్ని హర్షించలేకపోతూంది
కాలుష్యం, కాలుష్యం అని అరవకుండా వుండలేక పోతూంది
పిల్లలిక్కడి కొచ్చి ఏం పాడైపోతారోనన్న దిగులు వదలకుంది
నా ఓనమాలు ఒక్కడే కవిత్వాలై వెల్లువలైనా
ఈ వొట్టి తెలుగు చదువులకి
నా మస్తకమెందుకో మనసొప్పుకోవడం లేదు
పెరటి ఆకు గుమ్మం దాటితే చెత్తే అవుతుందని తెల్సినా
నా సిటీ జీవితం రంగులద్ది
కృత్రిమ పచ్చదనాన్నెక్కించి
మరో చోట పూలకుండీ అవుతుందని సమర్థిస్తుంది

*(అముద్రితం)*

# పునః ప్రతిష్ట

రాత్రి గడిచిపోతూందని త్వరబడి రాయడమే గానీ –
ఏం రాయాలి! ఎలా రాయాలి !
మనసు విసిగిపోతుందేమోనని సంతోషాన్ని ప్రదర్శిస్తూన్నట్టు –
సగం తాగొదిలిన స్తనాన్ని బిడ్డ చెంపకాన్చి
వచ్చిన కాస్త ఒంటరితనాన్ని పాలీకమర్చి
భద్రంగా రాత్రి బుగ్గల్ని చిదిమి దీపాలెలిగించడమంటే
పగటి పాకోద్వేగాలూ, మాపటి పతివ్రతా ధర్మాలూ తెంచుకుని
వరించిన ఒక్కగానొక్క మురిపాల రాత్రి
నాలుగ్గంటల్నీ ఎలాగోలా నిలదీయడమంటే
ఎంత కష్టం! ఎంత దృష్టకష్టం!!
నిశీథైనా జాలిపడ్తుంది కానీ నిమిషాలకి కనికరం వుండదు కదా!
పట్టుమని పది పదాలు మనసుతీరా ముద్రించుకునీ
విరుపుకున్న, చెరుపుకున్న క్షణాలు గుట్టలు పర్వతాలయ్యాయి
అంతలోనే సృష్టిఉత్సుకత
అంతలోనే పసి రోదన
అంతంత మాత్రం విశ్రాంతి పెరిగిపోయే అలసటనీ
తరిగిపోయే ఓపిక మిగలలేని కాలాన్నీ
దూషించుకుని తనివితీరా దులపరిస్తే మాత్రం ఏం లాభం!!
రాత్రి నిండా, రాత్రంతా





బాధామయరేపి వాళనిన్నలే
గడిచిపోతూంది అయిపోవచ్చింది రాత్రని గాభరాపడిపోవడమే గానీ
అనుభూతిలేని గరిటతో పాటూ తిప్పలేని భావోద్వేగ కలాన్ని
ఎక్కని నడుం విరగ్గొట్టను ?
ఎంతకని నిర్లక్ష్యం వహించను?
రాయి–రాయి–వ్రాయి
పని – ముందు – పని
విసుగూ, రోషం
పెళ్ళాం విధులూ, తల్లిత్వాలూ
నశించవా ఇంక – ఇంక అసలు నశించవా
మైలు రాళ్ళ బాధ్యతల ముళ్ళూ
బ్రతుకు కుంటి రాపిడి కవిత్వాలూ
వ్యధాజనిత రాతలూ, వ్రాతలూ

*"దీపావళి ప్రత్యేక సంచిక" ఆంధ్రజ్యోతి, 1995*

# పూల ప్రయాణం

మౌన వీణల తంత్రుల్ని మీటే నేస్తం జలపాతపు హోరైతే ఏమవుతుంది?!
నవ్వితే నొత్తలు పడేటి పుట్టు మచ్చ బుగ్గల్లాంటి
హసన్మందార కాలం మన ప్రక్కనే పరుగెడుతుంటే ఎలా వుంటుంది?!
చూసినంత అధికంగా మాట్లాడి
మాట్లాడి నంత అధికంగా ఉరకలు వేసి
గంభీర నాదం – నిలువెత్తు సముద్రం –
దుగ్గతేక్కొ చెరుకు గెడలు నమిలే బాలుడై పోతే –
గువ్వలతో నిశ్శబ్ద ఊహల్ని పంచుకుంటూ
గేయాల చింత మానునించి ఎగిరెగిరి కాయలేరే పసిఛాయలైతే –
ప్రపంచాన్కి వెరచి మనసు మూసుకునే మిత్రుడు
విశాలంగా పర్చుకున్న వెన్నెల నీటి మైదానమై
మోదుగుపూల గుత్తులతో హృదయద్వారాన్ని తెరచి నిరీక్షిస్తే –
దడా దడా రాళ్ళ మీంచి దుమికి అల్లరి నవ్వులలో దాక్కుని
హఠాత్తుగా మనసున విరిసే అద్భుత పూల ప్రయాణమై
దారంట కురిసే వానలాగా వెంటాడితే –
ఎలా ఎలా వుంటుంది!?!
ప్రయాణం ఒక మహాద్భుత సౌందర్య చిత్రం
అనుభూతి ఎంత వ్యక్తీకరించినా తరగని అందమైన జ్ఞాపకం
మిత్రుడా! నీకేమిచ్చి ఋణం తీర్చుకోను?!





పూలేరుకుందుకు వచ్చిన నాకు కొమ్మల్ని విరిచి యిచ్చినందుకు
నా జీవితంలో ఎప్పటికీ వికసించని నవ్వు గోగుపూలని
ఆహ్లాదమైన రంగులద్ది మరీ బహూకరించినందుకు
కట్టడమంత విశాలమైన కాలంలో
పావురాల స్వరాలంత వెగటు వర్తమానాన్ని
త్రోవ ప్రక్కన పచ్చని పోలాల వెంబడి చెట్ల గట్టులా
నువ్వొక్కడివీ ఒక్క చూపు మాటతో సస్యశ్యామలం, శీతలం చేసినందుకు –

(అముద్రితం)

# రాత్రి పుట్టిన మేఘం

కన్నబిడ్డనీ, కట్టుకున్నవాణ్ణీ వొదలి వొంటరి సమాధి అయినా
జ్ఞానోదయం కానేలేదు

ఈ రాత్రి ముళ్ళ నీటి వానలో గుండెని అభ్యంగన స్నానించినా
ఈ మేఘానికి రంగు, రుచి, వాసన అబ్బలేదు –
ప్రేమలోంచి ద్వేషం, అసహ్యం మీంచి కన్నీరు
కసిలోంచి మృత్యువు పుట్టుకొస్తాయే తప్ప
నన్ను కుట్టాలా, వొద్దా అని కందిరీగ ఆలోచించనట్టే నువ్వూనూ
నువ్వు నా జీవిత మాధుర్యాన్ని అమాంతం మింగేసే
చిన్నప్పటి నేపాళ భూతానివి
వట్టి ఉప్పునీళ్ళ మంత్రగాడివి
నే కన్రెప్పల పెదాలిరిచి, పాట మరిచి వొలికి పోయాననే కదా!
నిజానిజాలు తెలీకుండా మెడవంచి
నీ మూడు ముళ్లని శిరసావహించాననే కదా!
నేర్చుకుంటుంది నేర్చుకుంటుందీ పడమటి గాలి
పొరపాట్న విసుగెత్తి విరిగిపోయిందేమో
వలంతా విప్పి ఆటుపోట్లనెదుర్కొందేమో
నిజంగానే పెనువేగాన్నందుకుంటుంది
మేఘం లేత రంగు, లే రుచి, లేలేత వాసన కొడ్తూంది





నా జీవితమ్మీంచి నువ్వు నడిచెళ్ళ గలవేమో గానీ, శాసించలేవు
జన్మ నక్షత్రపు సొద ఎందుగ్గానీ జాతకాలు మార్చలేవు నువ్వు
పొగరాని నిప్పువి నువ్వు
వంచనా ప్రవచనాల్నిచ్చే సాక్షివి నువ్వు
నువ్వు వేళ్ళట్టుకు వేళ్లాడినా కొమ్మలెక్కనివ్వను
కాయల్ని ఏ కోర్టుకెక్కినా విదల్పజాలను
మేఘం ఎరుపు రంగు, మాంఛి రుచి, సువాసన చిమ్ముతోంది
సలసలా కాగుతున్న శబ్దం విన్పడనంత దూరం పో
కురవబోయే ముప్పెనలో ముల్గి పోకుండా కాపాడుకో
కొంచెం తిందువుగానీ పోనీ
నీ సొంత, స్వంత గుండె కాయని పేలిపోయేటట్టు వేపుతా

"ఆహ్వానం" ఏప్రిల్ *1994*

# రైలు వంచించిన రాత్రి

రాత్రి రహస్యంగా పట్టాల మించి పాకుతూన్నపుడు
ప్రశాంతత క్రమంగా సమూహాల్లోకి చొచ్చుకెళ్తున్నపుడు
వందల సమాధులు హఠాత్తుగా కట్టబడతాయి
అప్పుడే రాబోతున్న నిద్ర తాలూకు కల ఠక్కున తెగిపోతుంది
అంతవరకూ కంపార్టుమెంటుని ఖంగు మనిపించే స్వరం
అర్థాంతరంగా మౌనం పాటిస్తుంది
అప్పటి వరకూ పేపరో, పుస్తకమో తిరగేస్తున్న చెయ్యి ఆనవాలే దొరకదు
రాత్రి వున్నట్టుండి రణగొణగా మారుతుంది
కష్టాల్ని, కన్నీళ్ళని, సరదాలని, సంబరాలనీ, నిరాశల్ని, నికృష్టాల్నీ
రైలు తన ఇనప గుండెల్లోకి బలంగా హత్తుకుంటుంది
అక్కడ కొన్ని జీవితాలు అసంపూర్ణంగా తెరదించబడతాయి
దేహాలు దైన్యతనావరించుకునుంటాయి
తన్ను కాదని పోయిన భాగాల్ని శరీరం తిరిగి సమీకరించుకోలేదు
పనయిపోయిన ప్రాణాలకి రైలు జీవం పోయలేదు
సిగ్నల్స్ నిస్సహాయంగా చూస్తూన్నపుడు
ఇనపముక్కలు మూగగొంతు కల్తోయెలుగెత్తి రోదిస్తున్నపుడు
రాత్రి నిర్విరామంగా ప్రవహిస్తూనే వుంటుంది
నిర్దాక్షిణ్యంగా

"సాహిత్యవేదిక" ఆంధ్రజ్యోతి డైలీ
*17-07-1990*





# హార్డ్ "వేర్"

సాఫ్ట్‌వేర్ ఇంజనీరూ!
సాఫ్ట్ – 'వేర్'? ఇంజనీరూ?
కూలిన అంతస్తుల మధ్య నీ మేధస్సు సజీవ ఖననమై పోయింది
మేధో వలస బూడిదై నింగికెగిసింది
ముంచుకొచ్చే ఉపద్రవం సామ్రాజ్యవాదమని తెలీదా –
తను తీసిన గోతిలో నిన్నూతనతో పాటు లాగుతుందని అనుకోలేదా –
డబ్బు విదిల్చే అవకాశాల ఉచ్చులో నుగ్గునుగ్గయ్యేవు
నువ్వు ఆశపడ్డ మిఠాయి నిన్ను తినేసింది
నిన్ను కన్నందుకు జీవితాంతం కన్నీరే మిగిలింది
అయినా ఎవడిచ్చేడు అధికారం –
అమెరికా ఐనా, ఆఫ్ఘనిస్తానైనా –
సామాన్యుల్ని బలిగొనే భయంకరాధికారం ఎవడిచ్చేడు వీళ్ళకి?
మతం పేరిట, యుద్ధం పేరిట, ఆధిపత్యం పేరిట
బతుకుల్ని బుగ్గి చేసే హక్కు ఎవడిచ్చేడు?
సాఫ్ట్‌వేర్ ఇంజనీకూ!
ఇటీస్ హార్డ్ టు వేర్ –
అయినా ఇప్పుడెవడికి మాత్రం భద్రత వుందిలే
ఎప్పుడెవరికి మూడుతుందో గుండో దడలే
సామాన్యుడు సైనికుడిలా చావుకి తెగించాల్సిందే

ఆధిపత్యం కోరల క్రింద ప్రతీవాడూ సంజుడై పోవాల్సిందే
సాఫ్ట్‌వేర్ ఇంజనీరూ !
సాఫ్ట్ – 'వేర్'? ఇంజనీరూ?
గుండెల మీద చెయ్యేసుకునే నిశ్చింత రోజుల్లేవు
కడుపులో చల్ల కదలకుండా నిద్రించే క్షణాల్లేవు
మండే బతుకుల మరిగే రక్తంలో
ఆక్రోశాందోళన తప్ప ఆనందం లేదు
ఇవేళ నువ్వు
రేపు మేం
ఎల్లుండి ఎవరో
ఇంతే – ఇంతే –
మనిషి ప్రగతి అధోగతి
సగం చావు – సగం బతుకు
క్షరం క్షరం పురోగతి

*"దసరా ప్రత్యేక సంచిక" నేటి నిజం 2001*





# మెకానిక్ కుర్రాడు

ప్రపంచంలో ఏ విలువలూ తెలీని వాడొకడు
మసిబారిన వాసన గుడ్డల శరీరంతో
నూనె కారే రెంచిల చేతుల్తో
బురద పట్టిన చక్రాల్లాంటి పాదాల్తో
నిరంతరం ఎగిరి దుమికే గాలి పంపులా సన్నని డొక్కల ఊపిరితో
మెకానిక్ కుర్రాడొకడు
పన్నెండేళ్ళ వయసుకే మరకల బతుకులో మెలుకువలు నేర్చుకుంటాడు
నడుచుకొచ్చిన వాహనాల్ని పరుగెత్తించి
ఈడ్చుకొచ్చిన బళ్ళకి ప్రాణం పోసి
ఇనప ముక్కల శాస్త్రాన్ని సొంతం అనుభవాల్లో చదివి
పొద్దస్తమానపు సహాయకుడుగా
చిపిరి జుట్టులాంటి మురికి కూపం టైరు ముక్కల మధ్య
తిండి సంపాదన పరీక్షల్లో బొటాబొటీ మార్కుల్తో
ఏ రోజుకారోజు కొత్త పాఠం గట్టెక్కుతాడు
దుర్గంధపు చెమట అమ్మ ఒడి వాడికి
కత్తిమీద సాము లాంటి నిశితమైన నేర్పరితనం బడి వాడికి
బూతు మాటల వెకిలి చేష్టలె వినోదం వాడికి
రోజుల్లా 'పాచ్' పడిన బతుకుని

రోజల్లా 'పాచ్' పడిన బతుకుని
ఎంతగా ముక్కలు అతుకున్నా రాత్రికెపుడూ గాలి పోయిన టైరు జీవితమే
పాపం నిలువెత్తు వానలోనూ
కాల్చేసే ఆకల్లాంటి తీక్షణమైన ఎండలోనూ
పగిలిన పెదాల, పాదాల చలిలోనూ
బండచాకిరీ చేసినా
ఛీదరించుకునే వారే గానీ ఎవరూ జాలిపడని బతుకు వాడిది
వర్తమానాన్కి, భవిష్యత్తుకి అర్థం తెలీని
వాడికి మిగిలే రూపాయీ అర్ధల్లో వ్యసనాలు
సైలెన్సర్ల పొరపాటు వాతల్లా
స్క్రూ డ్రైవర్ల సూదంటు గాయాల్లా
బండదారి పుళ్ళుపడిన అరచేతుల్లా
జీవితాంతం అనుక్షణం బాధించి వెంటాడుతాయి
రేపటి ప్రపంచాన్కి వారసుడు
'కంప్యూటర్ యుగాన్కి' ప్రతినిధి
కాలే డొక్కల మెకానికల్ ఇంజనీరూ
పేర్లు ఏవైనా
దుర్గంధపు బాల్యాన్ని అనుభవిస్తున్న వాడొక్కడే
పాలకులకు కనిపించనిది వాడి పొట్ట కూడే

(అముద్రితం)





# పేగు పెంపకం

నా కడుపున పుట్టిన పాపానికి నువ్వూ అగ్ని ప్రవేశం
చెయ్యాల్సొచ్చిందిరా నాన్నా
దుస్సహ ఎడారి బతుకులో కన్నీళ్ళతో దాహార్తిని నువ్వూ తీర్చుకోవల్సొచ్చిందిరా
కన్నతల్లి ఆవేదనలనే కడుపు నింపినా
కళ్ళ బయటికి తెలియనివ్వడం రాని పసికందువు
ఎవరెంత కఠినంగా చెంప పగుల గొట్టినా
క్షమించడం, బాధించడం ఏమీ అర్థం తెలీని ఏడేళ్ళ బాలుడివి
నీలో మొండి వృక్షాలు మొలకెత్తకూడదనేగా
నీలోని రక్తంలా నువ్వూ సంస్కారవిహీనుడై పోకూడదనేగా
నా పెంపకం గొప్పదనపు తాపత్రయం కోసమేగా
నిన్ను బెల్టు దెబ్బలకి బలి చేస్కుంటున్నది
ఏడేళ్ళకే నీకు ఎల్ల మర్యాదలూ వచ్చేయాలి
ఎవ్వరికీ లేని అన్ని సలక్షణాలు నీకే వుండాలి
క్రమశిక్షణ శిక్షల్లో అనుక్షణం నువ్వు బాల్యాన్ని కోల్పోతున్నా
పెంచడం చాత గాని దద్దమ్మరా నీకు అమ్మ
"మొక్కయి వంగనిది మానై వంగునా..." సామెతలు నీ మెడకు చుట్టి
నిన్ను అనుక్షణం ప్రవర్తనా నియమావళిలో బిగించి
లోకాన్ని చితక్కొట్టలేనప్పుడల్లా నీ వీపు వాయించి
పెంపకపు పరీక్షలో నెగ్గాలనేరా నా దుష్ట ప్రయత్నం
తెల్లరగట్ల చదువు, బండెడు పుస్తకాల దరువు నీపై రుద్దినా

నువ్వు సాధించని 'ఎ'గ్రేడు గారాబానికి ముద్రగా మిగుల్తుంది
నీ ప్రతి కదలికిలోనూ నమ్రత వుండాలి
విధేయతని పుట్టుకతోనే నేర్చుసుకోవాలి
నువ్వు పారేసే రోజుకో పెన్సిలు
రాసుకురాని స్కూలు డైరీ
చింపేసే పుస్తకాల అట్టలు
నా పెంపకం లోని తీవ్ర లోపాలు
అనుక్షణం మన ఉనికిని ప్రశ్నించే క్రమశిక్షణల పర్వంరా ఇది
అమ్మ పసి బిడ్డని ముద్దాడే కాలం పోయింది
తనివితీరా గోరు ముద్దలు తినిపించడం మానేసింది
ఇక్కడ అమ్మకు మిగిలినవి బాధ్యతల లోటుపాట్లు
బిడ్డకు ఒనగూరేవి చివాట్లూ, చెప్పుదెబ్బలూ
చిన్న పిల్లల్ని దగ్గరకు తీసుకోవడమే నెత్తికెక్కించుకోవడం అయిన చోట
ప్రేమగా చూడడమే క్రమశిక్షణారాహిత్యం అయిన చోట
నీకు బాల్యమెక్కడ మిగుల్తుందిరా నాన్నా –
నా బిడ్డగా జన్మించినందుకు
నువ్వు బడబాగ్నిని బాల్యంగా మార్చుకోవాల్సి వస్తోంది
తనకు నచ్చినట్టు పెంచలేని తల్లిని
లోకం తెలీని నువ్వు అంగీకరించాల్సి వస్తుంది

*(అముద్రితం)*





# సరిహద్దు సంజ్ఞ

ఈ నిశ్శబ్దం
ఇదొక భీతి పూరిత, నైకృతిక నిశబ్దం
జీవితపు మద్యం గడగడా తాగినంతసేపు వుండదు
ఒక ప్రశాంత అభౌతికత్వాన్ని చేరుకునేలోగా ఎంత శారీరక, చిత్త వేదననీ!
ఇక్కడ బాధల్ని పంచుకోవడానికీ, బంధాల్ని పెంచుకోవడానికీ ఎవ్వరూ వుండరు
ఉండీ, లేకపోవడమూ ప్రేరకాలే
ఈ సరిహద్దు గీత మీద
జీతభత్యాలూ, కాలవివేచనాలూ వుండవు
ఇంతకాలపు అసత్య ప్రేమ విరహాల్నించీ
ఊహలు కట్టుకున్న నిర్గత సిద్ధాంతాల్నించీ
విషమం కావనుకున్న క్షణ సర్పాల్నించీ
ఈ నిస్త్రాణ జీవితాన్ని విడుదల చేయడమే ముక్తి మార్గం
అనుకుంటాం గానీ – బతికున్న కణాలు క్షణాలు లెక్కపెట్టుకోవడం
సౌలభ్యం కాదు
ఎంత అతృప్తిదారులైనా ఆజ్ఞాబద్ధులు కాక తప్పదు
మనసు నించి శరీరానికి
శరీరం నించి మనసుకీ డోలనాలు చెయ్యక తప్పదు
సంజ్ఞల్ని శిరసావహించీ, శిరసావహించలేక పోవడమే మహా కష్టాతి కష్టం
కీ కారణ్యంలో పొదల మాటు నించి ముఖాన్ని చూపించీ
కాలువల్ని దాటొచ్చిన ఒడ్డునే తిరిగి మిగిలి పోయీ

ఇన్ని వైఫల్యాలూ నవ్వు పెదాల్చాటున నొక్కి పెట్టెయ్యబడ్డాయేమో
నిగమసారాన్ని గ్రోలింది చాలింక
శుష్క జీవన వైవిధ్యాలు ఈ వ్యూహానికి సరిపోతాయి
తపో వాంఛ రీవిగా వుండేంత వరకు –
కాలంలో ఇంత నిశ్శబ్దం తప్పని సరి
అసంపూర్ణ వాక్యాల్లాగే చెరిగి పోవడం విధి
గడపడం చేతనైన వాళ్ళకీ
గడవడం చేతకాని వాళ్ళకీ ఒక్కటే దారి
వెన్నెలా, కోయిలా, మాతృత్వం, పెరుగు మీగడా
అన్నిటికీ జీవితాన్నదుక్కోవల్సిన గత్యంతరం పట్టింది
సౌధాలన్నీ పునాదుల్ని విర్చుకుని నంగనాచి మొహాలెయ్యాల్సి వచ్చింది
ఈ పర్యంతం ఏమేమి అవలోకించడానికీ వ్యవధి లేదు
ఈ ధ్వని రాహిత్యం
ఇదొక భీతిపూరిత, నైకృతిక –

*ఆదివారం ఆంధ్రజ్యోతి*
*29-11-1992*